ఈ నాటకం ప్రథమంగా 'కళాలయ' ఖర్గపూరు వారిచే ప్రదర్శించబడింది.

ప్రవాసాంధ్ర నాటక పోటీల్లో యీ నాటక ప్రదర్శనానికి ద్వితీయ బహుమతి, వుత్తమ నటనకు యిందులోని చిదంబరం పాత్రధారి శ్రీ కె. నాగేశ్వరరావుకు లభించాయి.

ప్రదర్శించిన నటవర్గం :

| | | |
|---|---|---|
| చిదంబరం | — | శ్రీ కె. నాగేశ్వరరావు |
| రామేశం | — | ,, దాసు |
| ఆనంద్ | — | ,, గోవిందరావు |
| చలం | — | ,, లక్ష్మణరావు |
| చక్రిపాణి | — | ,, ప్రసాద్ |
| డాక్టరు | — | ,, రెడ్డి |
| శేషాచలం | — | ,, పాపారావు |

ఈ నాటకం 'కనువిప్పు' అను పేరుతో ప్రథమంగా 'జాగృతి' పత్రికలో ధారావాహికంగా ప్రచురించబడింది.

—ప్రకాశకులు.

---

## —: గ మ ని క :—

ఈ నాటకం ప్రదర్శించ దలచుకున్నవారు నా అనుమతి పొందాలి.

—రచయిత.

**విలాసం :**

ముద్దంశెట్టి హనుమంతరావు
డి. పి. ఓ. ఆఫీసు,
ఖరగ్పూరు.

# కరిగిన శిల

[చిదంబరం యింట్లోని హాలు; హాలుమధ్య సోఫా. మూడు కుర్చీలు. సోఫాముందు ఓ చిన్న టీపాయ్ వుంటాయి. గోడలకు రెండు మూడు క్యాలెండర్లు వ్రేలాడుతూ వుంటాయి. యాభై సంవత్సరాలకు దగ్గరపడిన చిదంబరం, ఒకానొకప్పుడు తను తీయించుకున్న ఫొటోముందు నిల్చుని వుంటాడు. అప్పుడప్పుడు లోలోన చిన్నగా నవ్వుకుంటూ వుంటాడు. శంకరయ్య వస్తాడు. ఆఫ్ చేతులు షర్టు ముడుకులు దాటివుంటుంది. పైమీద మాసిన తువ్వా లొకటి వుంటుంది....]

శంక : నమస్కారమండీ చిదంబరంగారూ!

చిద : ఎవరూ? (నెమ్మదిగా వెనక్కి తిరిగి) ఓ! నువ్వా, శంకరయ్యా! రా... కూచో! (వచ్చి సోఫాలో కూర్చుంటాడు.)

శంక : (కుర్చీలో కూచుని) తమ రేవింటో, తమ ఫొటో ముందు నిల్చుని ఆలోచనలో పడ్డారు?

చిద : ఔను శంకరయ్యా! (నవ్వుతూ కళ్ళద్దాలు తీసి పంచె చివరితో తుడిచి పెట్టుకుంటూ) ఆ రోజుల్లో, నేను తీయించుకున్న ఫొటో అది... దాన్నిప్పుడు చూస్తుంటే నాకే ఆశ్చర్యంగా ఉంది. అందులో వున్న అప్పటి

చిదంబరానికీ నీ సమక్షంలో వున్న యీ చిదంబ
రానికీ యెంత తారతమ్యముందో గమనిస్తున్నాను!
అప్పటి నా శరీరదార్ఢ్యం... ఆరోగ్యం, యిప్పుడు వెద
కితే అగుపించవు. అంతటి ఆరోగ్యవంతుణ్ణి యిప్పు
డెలా మారిపోయానో చూడు! కాల గమనం చాలా
విచిత్రమైంది శంకరయ్యా! ఎప్పుడూ యేదో ఒక
జబ్బు వుండనే వుంటోందిప్పుడు. డాక్టర్లకి ధారపో
స్తున్న డబ్బు లెక్కవేసి చూసుకుంటే నీలాంటి
వాడివి గుండె బాదుకుంటావు.

శంక : (మందహాసంతో) డబ్బు ఖర్చంటేనే, నాకు భయం
లెండి బాబూ! రెండు రోజుల్నించి జ్వరంతో బాధ
పడుతున్నా; డబ్బు దండగని డాక్టరు దగ్గరికి వెళ్ళ
లేదు. ఎలా వచ్చిన జబ్బు అలానే పోతుంది లెండి.
వయస్సు మీదపడుతున్న కొద్దీ, ఆరోగ్యం కుంటు
పడకపోతే మరేవిఁటవుతుంది? ఈ వయస్సే అంత!
ఏదో, మీ దగ్గరకొస్తే అవసరముండి వచ్చానుగాని,
లేకపోతే నాలుగడుగులైనా వేసే ఓపిక లేదు.

చిద : నిన్ను చూడగానే అనుకున్నాను. ఏదో అవసరం
వుండి వస్తున్నావని. లేకపోతే వచ్చేవాడివేనా?

శంక : (లెంపలు వేసుకుంటూ) ఎంతమాట! ఎంతమాట!
ఈ మధ్యన వంట్లో కులాసాగా లేక రాలేదుగాని,
అంతకుముందు అప్పుడప్పుడు తమ దర్శనం చేసు
కుండేవాణ్ణి కదండీ!

చిద : (నవ్వి) ఊరికినే అన్నాన్లేవోయ్...ఆఁ...ఏదో అవసరంమీద వచ్చానన్నావు...ఏవిఁటో చెప్పు.

శంక : ఏుఁ లేదండి. కొండయ్యగారి దగ్గర ధాన్యం కొంటున్నాను. నా దగ్గర ప్రస్తుతమున్న డబ్బు చాలదు. మరో రెండు వందలు సాయం చేస్తే, మళ్ళీ మూణ్ణెల్లకు తిరిగి యిచ్చేస్తాను.

చిద : చేతిలో చిల్లిగవ్వయినా లేని సమయంలో వచ్చావు శంకరయ్యా!

శంక : మీరే అలాగంటే, యెట్లా చెప్పండి? ఈ అవకాశం చేజారిందంటే మళ్ళీ రాదండీ!

చిద : మంచి చిక్కే తెచ్చిపెట్టావయ్యా! మా యింట్లో అల్లుడూ, కూతురు, వచ్చి వున్నారా మరి? ఖర్చులకే బోలెడవుతోంది. రావల్సి వున్న డబ్బు చేతి కందలేదు. నువ్వింతగా అడుగుతున్నావుకాబట్టి, ప్రయత్నిస్తాను...ఎల్లుండి ఓసారి అగుపించు.

శంక : (ఉత్సాహంతో) అలాగేనండీ! ఆపాటి ఆసరా యిచ్చారు! అంతేచాలు. ఈ ఊళ్లో మాలాంటివారిని ఆదుకునేవాళ్లు మీరు తప్పించి యింకెవరున్నారు చెప్పండి?

చిద : దానికేంలేవోయ్; మనిషన్న తర్వాత మరోకరి సహకారం అవసరం లేకుండా వుంటాడా ఏమిటి? అరణ్యంలో ఒంటరి జీవితం గడిపితే తప్పించి, సమి

ష్టిగా సంఘంలో బ్రతుకుతున్నంతకాలం ఒకరి సహకారం మరొకరికి అవసరం వుంటుంది.

శంక : మంచిమాట శలవిచ్చారు. మీరు విశాల హృదయులు గాబట్టి, ఆ మాటన్నారు. లేకపోతే అందరూ అంతదూరం యోచిస్తారా? అన్నట్టు... అడగడమే మర్చాను. మీ ఆరోగ్యం మునుపటికంటే, కాస్త కుదుటబడింది కదండీ !

చిద : (అదోలా నవ్వి) ఏం కుదుటబడ్డం? ఏదో మొండి ఘటాన్ని కాబట్టి, యిలా యీడ్చుకొస్తున్నాను. మరొకరైతే యీసరికి దిగజారిపోయి వుణ్ణు, నా వంట్లో యెప్పు డెలా వుంటుందో, నాకే తెలీదోయ్! అప్పుడప్పుడు డాక్టరు యింటికొస్తుంటాడు. ఇప్పుడు క్రొత్తగా వచ్చాడే, ఆ డాక్టరుతో మహా బాధగా వుందోయ్...! 'నాపక్షాయిలా వున్నారు ... మీ రెందుకండీ, ఆరోగ్యంగురించి అలా కంగారు పడతారు' అనంటాడు, ఆరోగ్యంగా వుంటే, డాక్టర్లకి అనవసరంగా డబ్బుపోయటం నాకు సరదా అనుకున్నాడు గామోసు !

శంక : చూడ్డానికి వుక్కుమనిషిలా అగుపిస్తారు గదండి?

చిద : అబ్బే! అదీలేదోయ్ సగం మనిషినైపోయాను. నా యవ్వనపు రోజుల్లో అన్నావూ, నీ విప్పుడన్నమాట సరిగ్గా సరిపోయేది. ఆ రోజులు తల్చుకుంటే యిప్పు డేడుపొస్తుంది. (రామేశం వెలుపలనుంచి వస్తాడు.

పాతికేళ్ళ యువకుడు. అవ్యక్తంకాని, యేదో ఆవే
దన అతనిలో పొంచివుందని ఆ మొహంచెప్తుంది.
వచ్చి కుర్చీలో నిర్జీవంగా కూర్చుంటాడు...)

శంక : (రామేశంని చూసి చిదంబరంవేపు తిరుగుతాడు)
మీా అల్లుడుగారు కదండీ!

చిద : (విసుగ్గా) ఔనోయ్...

శంక : ఒక్కసారే చూశాను కదూ, సరిగ్గా గుర్తుపట్టలేక
పోయాన్లెండి. నాలుగు రోజులుపాటు వుంటారా?

చిద : (విసుగ్గా) ఏమో! నాకు తెలీదు...

శంక : (కనుబొమ్మలు అదోలా యెగురవేస్తూ) మరి నేను
వెళ్ళొస్తానండీ! నామాట మర్చిపోకండి యెల్లుండి
వస్తాను. మీారిచ్చిన వాగ్దానాన్ని నిలబెట్టుకోవాలి...
(లేస్తాడు)

చిద : అలాగే లేవోయ్...

(శంకరయ్య నమస్కారంచేసి వెళ్ళిపోతాడు. చిదంబ
రం కూడా లేచి ఇంట్లోకి వెళ్ళిపోతాడు.)

రామే: (నుంచుని) మామగారూ! యింక నేనెన్నాళ్ళు
యిక్కడ కూచుంటాను చెప్పండి? శలవు కూడా
అయిపోవచ్చింది.

చిద : శలవు అయిపోతే వెళ్ళిపో! ఇదీ ఓ చెప్పవలసిన విష
యమేనా?

రామే: (అదోలా నవ్వి) మీారు వెళ్ళిపోమని ప్రత్యేకించి

చెప్పనవసరంలేదు...ఆ సంగతి నాకు తెలుసు... ఒకటిమాత్రం మీరు గ్రహించాలి. నేనిక్కడ శాశ్వతంగా వుండిపోవడానికీ, మీ పంచన పడివుండడానికి రాలేదు.

చిద : ఆ అదృష్టం నీ నుదుట రాసి వుండొద్దటోయ్, నువ్వు యీ ఊరికి బదిలీ చేయించుకుంటే, మా ఇంట్లోనే, మా కళ్ళముందే, మీ రిద్దరూ హాయిగా కాలం గడపొచ్చుననికదూ, ఎన్నాళ్లనుంచో గోలబెడుతున్నాను? కాస్త చురుకైనవాడివనీ, చిన్నచిన్న వ్యవహారాలలో నాకు చేదోడు వాదోడుగా వుంటావనీ చెప్పాను...కాని నువ్వు వింటేనా?

రామే: మీరు చెప్పారు నిజమే. కాని, ఏ పనైనా తలపెట్టే ముందు కాస్త పరిణామాల్ని యోచించాలి కదూ! అమ్మ యిక్కడికి రానంటుంది. మీరు రమ్మని ఒకటే పట్టుబట్టారు. మధ్య నేనేం చేసేది? చెప్పండి! అసలు యిక్కడికి బదిలీ చేయించుకోవడం నాకూ్కడా అంతగా యిష్టంలేదు.

చిద : (వెటకారంగా) : ఔనౌను...ఎందు కిష్టముంటుంది? ఉండదు...నాకు తెలుసు. కోరి పిల్లనిస్తే, కులం తక్కువన్నారుట నీలాంటివాళ్ళే. కోరి పిలుస్తున్నాను కదూ, కొండెక్కి కూచుంటున్నావు. సరే! నీయిష్టం వచ్చినట్లు ప్రవర్తించు. మీనాన్న బ్రతికున్నరోజుల్లో ఆయనకీ నాకూ వున్న స్నేహంవల్ల ఈ సంబంధం

చేశానుగాని, లేకపోతే నిన్ను తలదన్నేవాళ్ళు వచ్చి వుందురు.

రామే: (కాస్త దెబ్బతిని) మావఁగారూ! మీరు చీటికీ మాటికి ఇదే విషయాన్ని ప్రస్తావించి నన్ను కించపర్చడం శ్రేయోదాయకం కాదు. మీకు నన్ను తలదన్నే అల్లుడు లభ్యం కావడమన్న విషయం నిర్వివాదాంశం. పోతే అప్పుడు మీకంటె ఉత్తములైన మావఁదొరికి, నేనూ సుఖ పడేవాణ్ణేమో! ఒకరి మంచిని చూసినప్పుడు మరొకరిమంచినికూడా చూడాలికదా! అయినా, ఇప్పుడవన్నీ ఎందుకులెండి? గతాన్ని త్రవ్వుకొని మరింత వైషమ్యాలు పెంచుకోవటం మంచిదికాదు. వైషమ్యాలు పెరిగితే పరిస్థితులు విషమంగా పరిణమించడం తప్పించి, మరో ప్రయోజనముండదు.

చిద : (చిరుకోపంతో) నువ్వు నాకు సుద్దులు చెప్పేదేవిఁటోయ్? అంత ధైర్యం యెలా వచ్చింది అని!

రామే: మాటల సందర్భంలో అన్నానేగాని, మీకు సుద్దులు చెప్పేటంత విజ్ఞత నాలో యెక్కడుంది? అసలు యివన్నీ నాకెందుకు? నేను రేపే వెళ్ళిపోవాలనుకుంటున్నాను.

చిద : వెళ్ళిపోవోయ్, నిన్నెవరు వొద్దన్నారు? ఇక్కడే కూచోమని యెవరూ బలవంత పర్చలేదే!

రామే: మీరు బలవంతపర్చరన్న విషయం నాకూ తెలుసు

నన్నుకోండి. అదికాదు నా ఉద్దేశం. నేను కోరేదంతా విజయను నాతో పంపించేయమని.

చిద : ఆవిషయం నే నేనాడో చెప్పేశాను. అమ్మాయిని యిప్పుడు పంపను.

రామే: మరెప్పుడు పంపిస్తారు?

చిద : అది నాఇష్టం.

రామే: ఆరునెలలనుండి నే నీపాటే పాడుతున్నాను. మీరా అపశ్రుతే వాయిస్తున్నారు. చూడండీ, నేను మీ అమ్మాయిని పెళ్ళిచేసుకున్నది ఆమెను మీయింట్లో వుంచడానికాదు. అదిమాత్రం మీరు గమనించాలి

చిద : (గతుక్కుమని) ఓహో! వ్యవహారం చాలదూరం వచ్చిందే! కాని, విజయకి అక్కడికి వెళ్ళడానికిఇష్టం లేకపోతే, ఎలా తీసుకువెళ్తావోయ్? అందుకనేగా, నిన్నిక్కడికి వచ్చేయమని చెప్తున్నాను! మీఅమ్మ యిక్కడికి రానంటే మానెయ్యోయ్. ఆవిడ ఆ వూళ్ళోనే వుట్టిగట్టుకుని వూరేలనీ! ఏదో నెలకింత పంపేద్దువుగాని.

రామే: మీ అయాచిత సలహాకి ధన్యవాదాలుమావఁగారూ! కాని, మాతృమూర్తిని అన్యాయం చేసేటంతటి మూర్ఖుణ్ణికాదు.

చిద : అవుతే విను. విజయ మనసుకి వ్యతిరేకంగా మీ యింటికి పంపేంతటి మూర్ఖుణ్ణి నేనూ కాదు.

రామే: ఎందుకుమావఁగారూ, యీ అబద్ధపునెపం? అబద్ధం చెప్పినా అతికినట్టుండాలి. నాతో రావడానికి విజయ కిష్టంలేదా? భర్తతోటిదే లోకమని, భర్తే తన సర్వస్వమని, అక్కడికే వెళ్ళిపోతానని విజయ మీ దంపతుల సమక్షంలో యెన్నిసార్లు కన్నీరు పెడుతూ ప్రాధేయపడలేదు? ఎన్నిసార్లు మీ రామెకునయానా భయానా నచ్చచెప్పడానికి ప్రయత్నించలేదు? ఇవన్నీ ఆమె నిరాకరణకి నిదర్శనాలా?

చిద : (వెటకారంగా) నువ్వేగామోసు, యివన్నీ చూశావు?

రామే: లోకంలో జరిగేవన్నీ మనం కళ్ళారా చూస్తున్నామా చెప్పండి? లేదు...కాని వింటున్నాం...

చిద : ఎవరు చెప్పారు? విజయేనా?

రామే: ఏం? ఆమె చెప్పకూడదా? భర్తతో చెప్పని రహస్యాలంటూ భార్య కేమైనా వుంటాయా? కాని... నిజానికి ఆమె చెప్పలేదు. విజయ అంత చురుకైనది కాదు. ఆమెలో వున్న బలహీనతల్లో యిదొకటి. దాన్ని ఆధారంగా తీసుకునే మీరు ఆట్లాడుతున్నారు.

చిద : మరెవరు చెప్పారు?

రామే: అదంతా అప్రస్తుతం.

(అదే సమయానికి ఆనంద్ వస్తాడు. స్ఫురద్రూపి కాస్త దురుసుతనం గలవాడని మొహమే చెప్తుంది.)

చిద : (కొడుకు వేపు క్రోధంగా చూసి) వీడేనా చెప్పాడు? వీడే అయ్యుంటుంది. చెప్తాడులే... చెప్తాడు. మీ యిద్దరికీ మొక్కడలేని పొత్తూ కుదిరిందిగా ?

ఆన : ఏవిఁటి నాన్నా, మీ రంటున్నది?

చిద : ఏవీఁ తెలీనట్టు, యేవిఁటని అడుగుతున్నావా? ఇంకే విఁటి? విజయ అత్తారింటికి వెళ్ళిపోతానని, మాదగ్గర మొరబెట్టుకోవడం నువ్వేనా చూశావు? మీబావతో చెప్పింది నువ్వేనా?

ఆన : ఔను ! నేనే చెప్పాను. ఇందులో తప్పేముంది?

చిద : నీ దృష్టిలో యేదీ తప్పుకాదు... నిన్ను యివన్నీ యెవడు చెప్పమన్నాడు ?

ఆన : అంటే, మీవుద్దేశం– యీ యింట్లో యెవరికీ పల్లెత్తు మాట అనడానిక్కూడా హక్కు లేదన్నమాట ! అందరూ మీ చేతిలో కీలుబొమ్మల్లా ఆడాల్సిందేనా యేవిఁటి ?

చిద : (కోపంగా) ఛీ ! ఛీ ! ఎంత బండబారిపోయావ్ రా ? మరి నాలుగు రోజులు పోతే, నన్ను యింటి నుండి కూడా తరిమేసేటట్టున్నావు. ఔను మరి! సహవాస దోషం వూరికనే పోతుందా?

రాంమే: (గతుక్కుమని) సహవాస దోషమా ? అంటే, మీ వుద్దేశం ?

ఆన : చీటికి మాటికీ, అతనిమీద విరుచుకు పడతారేవిఁటి నాన్నా ! ఆయన నేం చేశాడు ? తన భార్యను

తనతో పంపమనడం తప్పా? పంపించేయకూడదూ! ఎందుకీ రభసంతాను? నలుగురూ వింటే, నవ్వి పోతారు.

చిద : (కటువుగా) అది నా యిష్టం. నన్ను ఆజ్ఞాపించడానికి, నువ్వెవడవూ అంటాను! మాటాడకుండా నోరు మూసుకో!

రామే: నా విషయంలో మీ రిద్దరూ, వాగ్వివాదాలు పెంచుకోవడ మెందుకు! ఒక్కమాట చెప్పేయండి. విజయను యిప్పుడు పంపిస్తారా, లేదా?

చిద : (మొహం చిట్లించుకుని) దాని వంట్లో అస్వస్థతగా వుంది, మందు లిప్పిస్తున్నాను. అందుకే యిప్పుడు పంపను.

రామే: (అదోలా నవ్వి) అస్వస్థతగా వుందా? ప్లేటుమార్చారన్నమాట! మొదటి 'సాకు'కు సాక్ష్యం దొరికిపోయిందనే మార్చేశారు? సరేలెండి. వంట్లో అస్వస్థతగా వుంటే నేను మందు లిప్పిస్తాను. ఎవరిమనిషి వాళ్ళకు బరువా యేమిటి? మీకే బాధ్యతవుందిగాని, నాకు లేదూ? కన్న కూతురన్న మమత మీకే వుంది గాని, కట్టుకున్న భార్యన్న మమకారం నాకూ లేదూ?

చిద : చాలించవోయ్ యీ నీతికబుర్లు! భార్యమీద మమకారం వున్న వాడివైతే నేను చెప్పిన విధంగా యిక్కడికివచ్చి వుండేవాడివి. ముఖప్రీతి కోసం అలా అంటున్నావే గాని, నిజానికి నీకుభార్యంటే మక్కువ యెక్కడుంది?

రామే: నిదర్శనాలు లేకుండా, మీరీ విధంగా నిష్ఠూరా
లాడ్డం న్యాయంగా లేదు.

ఆన : మీరు బొత్తిగా అమానుషంగా మాట్లాడుతున్నారు
నాన్నా! ఎవరి భార్యమీద వారికి మక్కువ లేకుండా
వుంటుందా యెక్కడైనా?

చిద : నోరు మూసుక్కోమని నీ కెన్నిసార్లు చెప్పాలి? పోనీ
కుర్రాడివికదా అనియెక్కడికక్కడ సర్దుకు పోతూంటే
మరీ బిర్ర బిగుసుకుపోతున్నా వేవిఁటి ?

రామే: ఎందుకండీ, ఆనంద్ మీద కోపం? వున్నమాటన్నాడు.
తప్పేవిఁటి!

చిద : బావుందోయ్... నువ్వు నన్ను అదుపులో పెట్ట
డానికి ప్రయత్నించడ మేవిఁటి? మా అమ్మాయిని
కసురుకోడానికి హక్కు నాకు లేదా ?

రామే: లేదని యెవరన్నారు ? సంపూర్ణమైన హక్కుంది.

చిద : మరి, మధ్య నీ వెనకతాళం యెందుకు ? నీ గొడవేదో
నువ్వు చూచుక్కోరాదూ?

రామే: (పౌరుషంగా) నాగొడవ, మీరు పరిష్కారం చెయ్య
నిదే నన్నేం చెయ్యమంటారు ?

చిద : విజయను పంపమని ఏనాడో తేల్చి పారేశాను. పరి
ష్కారం చెయ్యడాని కిందులో యేముంది? నేను
పంపను... ఇప్పుడైనా తెల్సిందా! నీ యిష్టమొచ్చి
నట్టు చేసుకో!

ఆన : ఏవిఁటి నాన్నా యిది మొండివాదన ? మీ పట్టుదలకి

మీ అభిప్రాయాలకీ. ఓ అమాయిక వ్యక్తి జీవితాన్ని బలిచేస్తారా? దారీ తెన్నూ గానక, మిమ్మల్ని యెదిరించే ధైర్యంలేక చెల్లాయి యెలా కుమిలిపోతోందో మీకేం తెలుసు? ఆమెను బంగారు పంజరంలో బంధించిన చిలకల్లే కట్టు దిట్టాలతో యింట్లో వుంచుకుంటే, లోకులైనా హర్షిస్తారా? బావమీద మీకు కసిగా ఉంటే, పోనీ దానివ్యథ చూసి అయినా మీ మనసు మార్చుకోండి. ఏనాడు దాన్ని పరహస్తం చేశారో ఆనాటితో ఆమెపై మీకుండే అధికారం పోయింది.

చిద : (అందుకుని) మళ్ళీ నీపాట ప్రారంభించావూ? నోరు మూసుక్కోమని యింతవరకూ చెప్పింది యెవరికోయ్? నీక్కాదూ? అదికుమిలి పోతుంటే నీకేం? నీకు బాధగా ఉందా? (కోపంగా) కుమిలిపోనీ! ఏడవనీ! యింకా ఏడవనీ! బండబారిన భర్త హృదయాం గుర్తించనీ! మనోవ్యథతో చావనీ! అంతేగాని దాన్ని ఆయింటికి మాత్రం పంపించను.

ఆన : (వుద్రేకంతో) నాన్నా! ఏమిటా అభూయిత్యపు మాటలు? కన్న కూతురి చావుకోరే తండ్రి ఎవడైనా వుంటాడా?

చిద : (రెచ్చిపోయి) నువ్వు నాకు నీతులు నేర్పనక్కర్లేదు. లోపలికిపో!

ఆన : ఇంట్లోవుండికళ్ళారాయివ్వన్నీ చూస్తూసహించలేను

చిద : (కోపంగా) సహించలేవూ?... సహించ లేకపోతే

నువ్వూ యెక్కడికో వెళ్ళిపో! ఇప్పుడేం–ఉద్యోగం చేస్తున్నావు? స్వశక్తిపై ఆధారపడి వుండగలవు. ఆ ధైర్యం వుండబట్టే అంతగా బరితెగించి మాట్లాడుతున్నావు... వెళ్ళు ... వుండమని నిన్నెవరూ ప్రాధేయపడరు. ఒక్కక్షణం నాయింట్లో వుండొద్దు...

ఆన : (కోపంగా) మీరంత నిష్కర్షగా చెబుతుంటే అక్కడికి చేతగాని వాణ్ణి నేనేనా? సరే... పోతాను (వెళ్ళిపోబోతాడు.)

రామే: (ఆనంద్ చేయి పట్టుకుని) ఎందుకానంద్ అంతవుద్రేకం? పెద్దవాళ్ళు ఆపాటి అనకూడదా, మనం పడకూడదా? ఇంటినుండి వెళ్ళిపోయేటంతటి విషమ పరిస్థితు లేమీ ఏర్పడలేదే! లోపలికి వెళ్ళు... ఇంత ఆవేశం పనికిరాదు. ఉద్రేకంతో వ్యవహరిస్తే, ఒక్కొక్కప్పుడు సమస్యలు పరిష్కార మౌతాయి. కాని, రాబోయే పరిణామాలు అతి ఘోరంగా వుంటాయి, అందుకే. పర్యవసానం ప్రథమంలోనే యోచించి, ఎందులోనైనా దిగాలి.

ఆన : నీకున్నపాటి ఆలోచన మా నాన్నకుంటే, అందరం సుఖపడి వుందుం బావా! (చరచరాలోపలికిపోతాడు)

చిద : (రామేశంవంక చురచురా చూస్తూ) ఈవిధమైన బోధనలు చేసే, మాయింట్లో అందరిమెప్పులు పొంది వాళ్ళకి నా మీద ద్వేషం కలిగేట్టు చేస్తున్నావు.

రామే: అక్కడే మీరు పొరబడుతున్నారు. ఇంతకీ నీకూ

నాకూ వున్న విరోధం యేమిటి? వాళ్ళలో ద్వేషం రేకెత్తించాలన్న తలంపు నాకెందుకుండాలి? దాని వల్ల నాకొచ్చే ప్రయోజనం యేమిటి? ఇవన్నీ మీరు ఆలోచించడంలేదు. ఒకవేళ మిమ్మల్ని ద్వేషించినా, మీ డబ్బుని ద్వేషించలేరుగా! అందుకని వాళ్ల ద్వేషంతో మీకు ప్రమేయమే లేదు.

చిద : (విసుగ్గా) నీతో వాదన అనవసరం. తలాతోకా లేనట్టుగా మాట్లాడుతావు. నా నోరు నొప్పి చేసుకోవడం నాదే బుద్ధితక్కువ. ఇదిగో, ఆఖరు సారిగా చెప్తున్నాను... నాయింటి విషయాల్లో నువ్వు జోక్యం కలుగ జేసుకోకు. ఇక విజయ సంగతంటావా, నువ్విక్కడకు వస్తే సరేసరి; లేదంటే, నా యింటి ముందు కూచుని నువ్వు నిరాహారదీక్ష వహించినా సరే, అమ్మాయిని మాత్రం పంపను. తెలిసిందా?

(శంకరయ్య ఆత్రంగా వస్తాడు)

శంక : ఏమిటండోయ్, అల్లుడూ, మావాఁయేదో నోరుచేసుకుంటున్నారు!

చిద : (చిరుకోపంతో) అది వినడానికే వచ్చావేమిటయ్యా?

శంక : ఎంతమాటెంతమాట! నా అవసరంమీద వచ్చాను గాని, యీ తగూలన్నీ నాకెందుకండీ! నేను ఏ గొడవల్లోకీ పోనని మీకుమాత్రం తెలీదూ? (రామేశం వేపు తిరిగి) అయినా, అబ్బాయ్- పెద్దా, చిన్నా అనే అంతరం లేకుండా, ఇలా విగ్రపిగుతూ వాగ్వాదం పెట్టుకోవడమే! అందులోనూ, చిదబంరం

గారివంటి వృత్తములతోనా? నీకు నేను చెప్పాల్సిన వాణ్ణి కాదనుకో! అయినా, నీమేలు కోరే చెప్తున్నాను.

రామే: (తీక్షణంగా చూసి) నా మేలు కోరే చెప్తున్నారా?

శంక: ఔనయ్యా, ఔను!

చిద: చూడు శంకరయ్యా! మావాణ్ణి యీ వూరు బదిలీ చేయించుకోమంటే ససేమిరా రానంటున్నాడు! ఎందుకు చెప్తున్నానో కాస్తయినా ఆలోచించడు.

శంక: (వింతగా చూసి) ఔనబ్బాయ్! అవుతే, నువ్వు జీవితంలో చేయరాని పెద్ద పొరపాటు చేస్తున్నావన్నమాటే? ఈ సదవకాశం అందరికీ లభ్యమౌతుందా యేవిటి? ఈ అదృష్టం అందర్నీ వరిస్తుందా? నిజంగా యిది నీ అదృష్టమే అనుకో! మీ మామగారు నిన్నిక్కడకి రప్పించుకుంటున్నారంటే, అతనికి నీమీద యెంత అభిమానముందో, ఆలోచించుకో! ఊఁ... అను...... ఆలస్య మెందుకు? అనేయ్ అబ్బాయ్...

రామే: (కటువుగా) చూడండి శంకరయ్యగారూ!

శంక: చెప్పబ్బాయ్... ... చెప్పు... షరతు లేమన్నా వున్నాయా? చెప్పు...

రామే: తమరు అధిక ప్రసంగం చెయ్యకండా, నోరుమూసుకుని వచ్చిన పనేదో చూసుకుని వెళ్ళండి. తీర్పు చెప్పడానికి మిమ్మల్నెవరూ పిలవలేదు. చిదంబరం గార్ని మీ అవసరార్థం ఆకాశాని కెత్తాలన్న అభిప్రాయమేవుంటే దానికి సవాలక్ష మార్గాలున్నాయి. (విసురుగా లోపలికి పోతాడు)

శంక: (చిన్నబుచ్చుకొని) ఎంతమాట... ఎంతమాటనేశాడు? ఇంతవరకూ మీ అల్లుడు చాలా అమాయకుడనుకున్నానండీ?

చిద: అమాయకుడైతే, నాకెందుకింత శ్రమ?

శంక: నిజమేనండి బాబూ! నిజమే! పిడుగులాంటివాడు. ఇన్నేళ్ళ వయస్సు మీద పడినా, ఇంతవరకూ ఎవ్వరిచేతా నోరు మూసుకోమని అనిపించుకోలేదండి; యింతకంటే, అవమానం యింకేముంది! నా వయసుకైనా గౌరవం యిచ్చాడు కాదే! మీ అల్లుడైపోయాడు గాని, లేకపోతేనా ... (నిళ్ళు నమిలేస్తాడు.)

చిద: సరేలేవోయ్...కుర్రాడుకదూ? ఉద్రేకంకొద్దీ ఏదో అనేశాడు. అసలు నువ్వు మా యింటి విషయాల్లో జోక్యం కలిగించుకోవడమే తప్పుకదూ?

శంక: (తెల్లబోయి) మీరే కదండీ తగువు చెప్పారు?

చిద: చెప్పాననుకో! వ్యాపారస్తుడివై ఉండి, ఆపాటి వ్యవహారజ్ఞానం లేకపోయిందటయ్యా! 'ఈ గొడవలన్నీ నాకెందుకండీ' అని నువ్వు తటస్థంగా ఊరుకుంటే పోయుండేదిగా!

శంక: బుద్ధి గడ్డి తిని మీ తగవు మధ్య కొచ్చానండి. వచ్చినందుకు తగిన శాస్తి కూడా జరిగిందిగా! లెంపలేసుకుంటున్నాను. (లెంపలేసుకుంటాడు)

చిద : (నవ్వి) మొత్తానికి మంచివాడివే నయ్యా! చిన్న పిల్లాడిలా తెంప లేసుకోవడమేమిటి? సరేలే? అవన్నీ మనసులో ఉంచుకోబోకు, యింతకీ మళ్ళీ నువ్వు వచ్చావేం ?

శంక : (నవ్వు తెచ్చి పెట్టుకుని) మీ అల్లుడు అలా అన్నాడని నాకేం బాధ లేదు లెండి...! యింతా నేను చెప్పినా, అతను విన్నాడు కాదే నన్నదే నేను విచారిస్తున్న విషయం...

చిద : వినక పోనీవోయ్...తర్వాత అతడే అనుభవిస్తాడు. మనకేం? నువ్వు వచ్చినపని చెప్పవేం?

శంక : కొంప మునిగిపోయిందండీ! ఇలా కథ అడ్డం తిరుగుతుందని నే నెప్పుడూ అనుకోలేదు.

చిద : ఏమయ్యిందోయ్ ?

శంక : కొండయ్యగారు ఇంత కపటంగా ప్రవర్తించి, దగా చేస్తారని కల్లోకూడా అనుకోలేదండీ. అతనిలాంటి తగు పెద్దమనిషి ఆడినమాట తప్పి, న్యాయాన్ని ఖూనీ చేస్తాడని అసలే అనుకోలేదండీ!

చిద : (విసుగ్గా) అబ్బబ్బ! ఏమయ్యిందో చెప్పకండా, యెందుకోయ్ ఈ గోల ?

శంక : నా గొడవ మీకు 'గోల'గానే ఉంటాదండీ! నా బాధ మీకేం తెలుసు ?

చిద : అదే ఏమిటో చెప్పవోయ్...

శంక : కొండయ్యగారు పది బస్తాల ధాన్యం ఇస్తానని ఒప్పు కున్నాడా మరి ?

చిద : ఔను! ఇప్పుడేమయ్యిం దవుతే ?

శంక : ఇప్పుడేమో... ఇప్పుడేమో...

చిద : అలా తడబడతా వేమిటోయ్?

శంక : తడబడ్డ వేమిటండీ? (కోపంతో) వళ్ళంతా దహిం చుకు పోతుంటేను ?

చిద : కాస్త శాంతం వహించి, చెప్పవోయ్...

శంక : ఈ శంకరయ్యకి శాంతం ఉంది గనుకనే, ఇంత వరకూ సహించాడు. ఇప్పుడేమో, యింకెవరో ఎక్కువ ధర యిస్తామన్నారట... వాళ్ళకిచ్చేస్తారట. చూడండి, ఎంత అన్యాయంగా వుందో ?

చిద : మొదట నీకు మాటిచ్చి, ఇప్పుడెలా తప్పుతాడోయ్?

శంక : అదే చూడండి ... మీలాంటి పెద్దలు, ఆ మాటే గట్టిగా అడగాలండీ ?

చిద : నువ్వడగ లేకపోయావోయ్ ?

శంక : అడిగానండీ! అడిగితే అంటారూ, తక్షణం నేను డబ్బు తెచ్చిస్తే, ధాన్యం యిస్తారట ... ఈ రోజు దాటిందంటే, ధాన్యం గురించి అడగడానికూడా నాకు హక్కు లేదట. నా లోకువ చూసుకుని, చూడండి, ఎంత కార్కశ్యంగా మాట్లాడుతున్నారో !

చిద : ఎలా కాపోతే అంత డబ్బు గడించాడు ? అత నెప్పుడూ అంతే !

శంక : ఎల్లుండి వచ్చి ధాన్యం పట్టించుకు పోతానండీ అని చెప్పడానికి వెళ్ళానండీ ! వెళ్తే ఇదీ వార్త.

చిద : ఇంతకీ, నువ్వేం చెయ్యదల్చావు ?

శంక : (దిగాలుపడి) నే నేం చెయ్యగలనండీ ? ఈ సమయంలో మీరే ఆదుకోవాలి. మీ రిస్తామన్న డబ్బు ఇప్పుడే ఇచ్చేస్తే, ఎంతో మేలు చేసినవా రౌతారు. నాదగ్గర డబ్బు నిలవా వుండదన్న నమ్మకంతో కొండయ్యగారు ఈ పాచిక వేశారు.

చిద : ఇప్పుడు నే నెక్కణ్ణించి తెచ్చేదోయ్ ?

శంక : (ప్రాధేయంగా) బాబ్బాబూ ! మీకు పుణ్యముంటుంది. ఈ సహాయం ఈ సమయంలో చేశారా, జన్మ జన్మాలకీ మీ మేలు మర్చిపోను. డబ్బు తీసుకెళ్తే ఆయన కళ్లు పచ్చగైపోవాలి.

చిద : (చిన్నగా నవ్వి) అవుతే, అతని మీద పంతంగట్టి వచ్చావన్న మాట !

శంక : (తడబడి) అబ్బే ! అబ్బే ! మాలాంటివారికి పంత మేవిటిలెండి బాబూ. కాని, అభిమానమంటూ ఒకటి యేడ్చింది గదండీ ?

చిద : (సాలోచనగా) సరే !

శంక : (తృప్తిగా నిట్టూర్చి) హమ్మయ్య ! పోతున్న ప్రాణాలు తిరిగి వచ్చాయండీ ! నిజంగా మీ ఋణం తీర్చుకోలేను.

చిద : ఆఁ ! దానికేం లేవోయ్ ! (ప్రక్క గదివేపు చూసి)

ఓయ్ చక్రపాణీ! (ప్రక్క గదిలోంచి 'వస్తున్నా బాబూ' అన్న జవాబు వస్తుంది. క్షణంలో చక్ర పాణి వస్తాడు. మధ్య వయస్కుడు. పంచె, కోటు వేసుకుని వుంటాడు.

చక్ర : పిల్చారాండీ...?

చిద : ఔనోయ్! ఈ శంకరయ్యకి రెండు వందలు కావాలట, నోటురాసి, సంతకం తీసుకో!

చక్ర : అలాగేనండి! (శంకరయ్యవేపు తిరిగి) మీ ఇంటి పేరు చెప్పండి శంకరయ్యగారూ?

శంక : వంకాయలవారు...

చక్ర : వంకాయలవారు శంకరయ్యన్నమాట.

శంక : (ఆశ్చర్యంగా) అదేవిటయ్యా! వంకాయల శంకరయ్యే! 'వారు' కూడా పెడతానంటావేమిటి!

చక్ర : అలాగా! పొరబడ్డానండి...తండ్రిపేరేవిటి?

శంక : రాజన్న!

చక్ర : కాస్సేపట్లో వస్తానుండండి... (గదిలోకి పోతాడు)

శంక : మంచి సమయంలో నన్నాదుకున్నారండీ! ఎలా కృతజ్ఞత తెలపాలో బోధపడకండా వుంది.

చిద : అసలూ, వడ్డీ, సవ్యంగా ఇచ్చేస్తే, అదే కృతజ్ఞత!

శంక : (మొహం ముడుచుకుని) ఎప్పుడైనా నేనలా మోసగించానా చెప్పండి!

చిద : (నవ్వుతూ) మాటవరస కన్నాన్లేవయ్యా! లేకపోతే

నీమీద నమ్మకం లేకపోవడమేమిటి? ఆఁ ... మరి, వడ్డీ యెంతో తెలుసుగా!

శంక : తెలీకేమండీ! రూపాయికి కానీ కదూ!

చిద : (నవ్వుతూ) ఆ రోజులు గతించాయి శంకరయ్యా! కాలాన్ననుసరించి మనంకూడ మారాలికదూ. ధరలు యెలా చుక్కల్ని అంటుకున్నాయో, చూస్తున్నావుగా? స్వయంగా వ్యాపారం సాగిస్తున్నావు. నీకు చెప్పాలా ఏమిటి? అందుకే, రూపాయికి అర్ధణా చేశాను. కనీసం గుమాస్తాకి జీతం ఇవ్వడానికైనా రాబడి వుండాలా మరి?

శంక : నాదగ్గర కూడా తమరు ఇలాగే తీసుకుంటే, ఎలా చెప్పండి? పిల్లలు గలవాణ్ణి...

చిద : పిచ్చివాడా! నీ దగ్గర గాబట్టి అర్ధణా! మరొకరవుతే అణాలు... తెలిసిందా?

శంక : (నిరుత్సాహంగా) సరే! మీ ఇష్టం... అవసరానికి ఆదుకుంటున్నారు... అదే పదివేలు.

(వెలుపలినుండి డాక్టర్ చంద్రం వస్తాడు. పాతికేళ్ళ యువకుడు)

డాక్ట : (వస్తూనే) నమస్కారమండీ చిదంబరంగారూ!

చిద : (లేచి నుంచుని) నమస్కారమండీ డాక్టరుగారూ! రండి... రండి... కూర్చోండి!

(శంకరయ్యకూడా నుంచుంటాడు)

డాక్ట : వయసులో పెద్దలు...పూజ్యులు. మీరు నాకు నమస్కారం అనడం సమంజసంగా లేదు ...మీకు ఎన్నోసార్లు చెప్పాను. అలా అనొద్దని.

చిద : వయసులో పెద్దవుతేనేం లెండి...విజ్ఞానంలో పెద్దలు మీరేగా. వయస్సుతో పనేముంది? ఆఫీసర్లుమాకంటె చిన్నవాళ్లే ఉంటారు. అలాగని నమస్కారం పెట్టడం మానేస్తున్నామా? ఆ గౌరవం సీటుదాకి చెందుతుందే గాని, వయస్సుకికాదు.

డాక్ట : సరే, మీ యిష్టం...! ఇటుగావచ్చినప్పుడోసారి వస్తుండమని చెప్పారుగా! మీరు ఆరోగ్యంగాఉన్నా సరే యెందుకో మీ కా పిచ్చి!

చిద : నిజంగా మీకు శ్రమ కలిగిస్తున్నాను క్షమించాలి మరి! పెద్దకాలపువాణ్ణి. కాస్తంత పిచ్చి నమ్మకాలుంటాయి. గట్టి మనిషిని కాదుకదూ! అందుకే రమ్మంటుంటాను. అలా నిల్చునే మాట్లాడుతున్నారు... కూర్చోండి.

(గదిలోంచి చక్రపాణి వస్తాడు)

చక్ర : (చేతిలోని నోటు చిదంబరంకి అందిస్తూ) ఇదిగోండి బాబూ! ఓసారి తమరు చూసేస్తే...

చిద : (కోపంగా చక్రపాణివేపు చూస్తూ) ఉండవోయ్ పెద్దమనుషులతో ప్రసంగిస్తూ వుంటే పానకంలో పుడకలా మధ్యన వస్తావేంగుకు? ఇంత వయస్సు

వచ్చిందన్న మాటేగాని, కాస్తయినా మర్యాదా, మట్టూ తెలీదోయ్...?

చక్ర : (బిత్తరపోయి, రెండడుగులు వెనక్కి వేసి) తప్పయి పోయింది బాబూ!

డాక్ట : పోనీ లెండి. చిదంబరంగారూ! తెలీక యేదో ప్రవర్తించాడు. మీరూ అల్లా కోపగించుకుంటే ఎట్లా? కాస్త సర్దుకుపోవాలి మరి!

చిద : ఏం సర్దుకుపోవడమండీ! దేనికైనా హద్దంటూ వుండాలి...

డాక్ట : మరి...నాకు శలవిప్పిస్తారా?

చిద : కప్పు కాఫీ అయినా తీసుకోకుండా వెళ్ళిపోతున్నారే కూర్చోండి... తెప్పిస్తాను.

డాక్ట : అబ్బే! వద్దులెండి...ఇప్పుడే తీసుకున్నాను. అన్నట్టు నేను రాసిన మాత్రలు తీసుకుంటున్నారు కదూ!

చిద : ఔనండీ!

డాక్ట : సరే! వస్తానండీ మరి!

(డాక్టర్ చంద్రం వెళ్ళిపోతాడు, అతణ్ణి ద్వారం వరకు సాగనంపి తిరిగి వస్తాడు చిదంబరం)

చిద : (కటువుగా) ఔనయ్యా. చక్రపాణీ!

చక్ర : (భయంతో) బాబూ!

చిద : నీ కేమన్నా మతి వుందటోయ్? లేకపోతే మద్యపానం చేసివచ్చావా? డాక్టరుగారి సమక్షంలో యీ

నోటు నాకు చూపిస్తావా? ఏం తెలివితేటలయ్యా? నీ బుర్రలో ఉన్నది మెదడా? మట్టా? 'ఈనోటు ఏవిటండోయ్?' అని డాక్టరు అడిగితే నన్నేం సమాధానం చెప్పమన్నావు? వడ్డీవ్యాపారం సాగిస్తున్నానని చెప్పమంటావా! చూడగా, చూడగా, నాకొంప ముంచేటట్టున్నావయ్యా!

చక్ర : క్షమించండి బాబూ! ఆ తొందర్లో అలా వచ్చేశాను. అంతేగాని, బుద్ధిపూర్వకంగా రాలేదు.

చిద : అసలు నీకు బుద్ధి అన్నది ఒకటి వుండేడిస్తేగా !

చక్ర : చిత్తం...

చిద : నక్క-వినయాలు ప్రదర్శించడంలో ఫస్టు. ఏదీ, ఆ నోటు శంకరయ్యకివ్వు.

చక్ర : చిత్తం (నోటు శంకరయ్య కిస్తాడు)

చిద : సంతకం పెట్టు శంకరయ్యా !

శంక : చదవనీయండి మరి.

చిద : (చిన్నగా నవ్వి) చదువు...నిన్నెవరొద్దన్నారు?

శంక : (చదివి) అర్ధణా వడ్డీయే రాసేశారే...?

చిద : ముందే చెప్పాను కదటోయ్...?

శంక : సరే ... (సంతకం పెట్టి, కాగితాన్ని చక్రపాణి చేతికిస్తాడు) మరి...డబ్బు...?

చిద : ఇస్తానుండవయ్యా! సంతకం పెట్టించేసి, వట్టిచేతుల్తో నిన్ను పంపుతాననుకున్నావా ఏవిఁటి?

శంక : అబ్బే! కాలం మంచిది కాపోయినా, మీ గురించి అలా అనుకోగలనా? ఎంతమాట!

చిద : (నవ్వి) మొత్తానికి మాటకారివి! (లోపలికి పోతాడు)

శంక : (మెల్లగా) రూపాయికి అర్ధణా వడ్డీ అట... చూడవయ్యా చక్రపాణీ!

చక్ర : మీకు గాబట్టి ఇలా ఇస్తున్నారు. అందుకు సంతోషించండి. మరొకరికైతే అణాలే! కొందరికి లేదనే చెప్పేస్తుంటారు. నేనేగా అన్నీ రాస్తుంటాను?

శంక : (విసుగ్గా) నువ్వు మరీను లేవయ్యా! పిల్లికి ఎలుక సాక్ష్యంలా చెప్తావు!

చక్ర : ఉన్నమాట చెప్తే కోపం తెచ్చుకొంటా రేవిటండీ?

(చిదంబరం లోపల్నుంచి వస్తాడు. అతని చేతిలో నోట్లుంటాయి)

చిద : ఇదిగో శంకరయ్యా! నువ్వింతగా ప్రాధేయ పడ్డావు గనక, ఇస్తున్నాను. అన్న గడువుకి తిరిగి ఇచ్చెయ్యాలి సుమా! నా దగ్గర కూడా డబ్బు అట్టే నిలవ లేదు. (ఇస్తాడు)

శంక : (తీసుకొని జేబులో పెడుతూ) అలాగేనండీ! మూణ్ణెల్లలో తిరిగి ఇచ్చేస్తాను, మీ దగ్గర ఇన్నిసార్లు తీసుకెళ్లానుగాని, అన్నమాట ఎప్పుడైనా తప్పానా?

చిద : అందుకే గదోయ్. అకస్మాత్తుగా కావాలన్నా ఇచ్చాను.

శంక : నిజంగా మీరు చాలా మంచివారండీ! ఇప్పుడే కొండయ్యగారి దగ్గరికి వెళ్తాను. వస్తానండీ మరి...
(లేస్తాడు)

చిద : మంచిది... వెళ్ళు.

(శంకరయ్య వెళతాడు)

చక్ర : (నోటు చిదంబరంకి అందిస్తూ) ఇదిగోండి బాబూ!

చిద : (అందుకొని) పుస్తకంలో రాశావా ?

చక్ర : లేదండీ ! ఇప్పుడు రాస్తాను.

చిద : వుద్ధరిస్తావు ! అనుభవం వస్తున్నకొద్దీ, ఉన్న మతి పోతోందోయ్ నీకు ! ఇప్పుడిప్పుడు చూడు — డాక్టరుగారి సముఖాన ఎంత తెలివి తక్కువగా ప్రవ ర్తించావో ? చాలా కాలంనుండి నాదగ్గర పనిచేస్తున్నావని ఊరుకున్నానుగాని లేకపోతే నాకు వేరే గుమాస్తా దొరకడనికాదు.

చక్ర : (భయంగా) దొరక్కపోవడమేమిటీ బాబూ! మీ లాంటివారిదగ్గర పనిచెయ్యడానికి వేనకి వేలు గంతు లేసుకుని వస్తారు. కాని, ఎంతో కాలంగా మిమ్మల్ని కనిపెట్టుకుని వున్న యీ బీదవాణ్ణి మీరు కనిక రించకపోతే ఎలా చెప్పండి?

చిద : కనికరిస్తున్నాను గాబట్టే యింతవరకూ నువ్వు నా దగ్గర పనిచేస్తున్నావు. లేకపోతే, ఏనాడో నీస్థలంలో మరొకాయనుండేవాడు; తెలిసిందా...?

చక్ర : ఆసంగతి నాకుమాత్రం తెలీదా బాబూ! మీరు దయామయులు.

చిద : సరేలే...నువ్వు వెళ్ళి నీపని చూసుకో!

చక్ర: చిత్తం! (పక్కగదిలోకి పోతాడు)
(చిదంబరం యింటిలోపలికి పోతూవుండగా, రామేశం, ఆనంద్ లోపల్నుంచి వస్తూంటారు. వాళ్ళిద్దర్నీ చూసి, అసూయతో, క్రోధంతో మొహం పక్కకి తిప్పుకుని పోతాడు చిదంబరం)

ఆన : చూశావా బావా, మనిద్దరం కలిసి వస్తున్నామని మా నాన్న ఖెలా మొహం చిట్లించుకున్నారో!

రామే: (బాధగా) నేనూ గమనించాన్లే! అలాకూచో నీతో కాస్త మాట్లాడాలి. (ఇద్దరూ కూచుంటారు.)

రామే: నేనంటే, మీనాన్నకి ఎందుకంత కసిగావుంటుందో కారణం వూహించలేకపోతున్నాను ఆనంద్! నేనేం అపకారం చేశానని? ఎందుకీ కక్ష?

ఆన : నువ్వు చేసిన అపకారం ఒక్కటే!

రామే: (గతుక్కుమని) నే నపకారం చేశానా? నేనా! ఏమిటది?

ఆన : నువ్వు మంచిగా వుండడమే నువ్వు చేస్తున్న అపకారం బావా! నీ స్థితిలో మరొకడుంటే, ఏదో ఒకటి తేల్చేసును.

రామే: నాకూ అది చేతనవును ఆనంద్! కాని, పర్యవసానంకి భయపడి ఆలోచిస్తున్నాను. ఇంతకీ, మీ నాన్నగారు నన్నిక్కడికి వచ్చేయమని పట్టుబట్ట

డంలోని అంతరార్థం ఏమిటో! అవగాహన కాకుండా వుంది.

ఆన : నే నూహించినంతవరకూ. ఒకటే అంతరార్థం.

రామే: ఏమిటి?

ఆన : ఆయనగారి స్వార్థం.

రామే:(ఆశ్చర్యంతో) స్వార్థమా? నా నుండి ఆయన పొందే సహకారం, లేదా లాభం ఏమిటి?

ఆన : ఉంది గనుక నే.

రామే:ఏమిటి?

ఆన : ఈవూళ్ళో మీ ఆఫీసు ఉందిగా?

రామే: ఔను. వుంది, అయితే?

ఆన : ఆ ఆఫీసులోనే నాన్నకి ఎక్కువ పనులుంటాయి. నువ్వు యిక్కడికి వచ్చేస్తే. ఆయన అవసరాలు నిరాఘాటంగా నెరవేరుతాయిగా! ఇదీ కారణం.

రామే: ఇంకేమన్నా కారణాలున్నాయేమిటి?

ఆన : మరొక్క కారణముంది. విజయని తన కళ్ళెదుటే వుంచాలని అమ్మ పట్టుదల. విజయకి యిష్టంలేక పోయినా సరే, అమ్మ తన పట్టుదల విరమించుకో లేదు. అమ్మ చెప్పిందే వేదంలా అనుసరిస్తారు నాన్న! ఈ రెండు పట్టుదలలూ యీావ త్తికికి కారణ భూతాలయ్యాయ్.

రామే: ఎవరి స్వార్థం వారే చూసుకుంటున్నారుగాని, నా సంగతి ఆలోచించడం లేదు. నువ్వే ఆలోచించు

ఆనంద్...ఎలా వచ్చేయటం? అమ్మ యిక్కడికి రానంటుంది. రమ్మని బలవంతపర్చడం నాకు మనస్కరించడంలేదు. పోనీ, అమ్మను అక్కడవుంచి, మేం యిక్కడికి రావడానికి తాహతు చాలదనిపిస్తోంది. పోతే, అలా జరిగేపక్షంలో లోకుల విమర్శల్ని తట్టుకోవడం కష్టమని ఒకపక్క భయంవుంది. ఏంచెయ్యడానికీ పాలుపోవడంలేదు.

ఆన : చెల్లాయిపరిస్థితి మరీ అధ్వాన్నంగా వుంది బావా! ఎటూ యేమీ చెప్పలేదు. లోలోన కుమిలిపోతుంటుంది.

రామే: నాకూ తెలుసు ఆనంద్! కాని, ఏం చెయ్యగలను? ధైర్యంచేసి నాతో వచ్చేయమన్నాను. కాని, విజయ రానంటుంది. తల్లిదండ్రులతో తగవుపడి రావడానికి మనసొప్పదంటుంది. వెనుకచూస్తే గొయ్యి; ముందు చూస్తే నుయ్యిలా వుంది నా పరిస్థితి.

ఆన : చెల్లాయి కాస్తంత చలాకీ పిల్లవుతే బావుండేది... అసలు బొత్తిగా ఛాందసురాలు.

రామే: అదే యిప్పుడొచ్చిన చిక్కోయ్! మరో విషయం ఆలోచించావా? విజయ అక్కడికి రాకపోవడం, యిరుగు పొరుగు వాళ్ళల్లో చిన్న సంచలనం రేపుతుందనడంలో అతిశయోక్తి వుండదేమో. వాళ్ళ విమర్శలు రకరకాలుగా వుండొచ్చు. మనం నిజం చెప్పినా వాళ్ళు నమ్మరు.

ఆన : నిజమే మరి! ఇక్కడ మా పరిస్థితి అలానే వుంటుంది కాని, నాన్న యివన్నీ యోచిస్తేగా! మనిషిలో చలనమన్నది కాస్తయినా వుండదు. ఆయనకి హృదయం లేదు. ఉన్నా, అది పాషాణంతో సమానం.

[చిదంబరం ఆతృతగా లోపల్నుంచి వస్తాడు. అతని చేతిలో ఓ కాగితం వుంటుంది. రామేశం, ఆనంద్ – అక్కడే వుండటం గమనించి ద్వారం దగ్గరే ఆగిపోతాడు చిదంబరం.]

చిద : (ఆత్రంగా) చక్రపాణీ !

చక్ర : (వస్తూ) ఏం బాబూ !

చిద : నువ్వు పేరుకే గుమాస్తాగా వున్నావుగాని, నీపనంతా నేను చూస్తున్నట్టే! చూడూ – శేషాచలం తెలుసు కదూ ?

చక్ర : తెలీకేమండీ! సైకిలు షాపుంది.

చిద : ఆఁ... అతడే!

చక్ర : రమ్మని చెప్పమంటారా?

చిద : (విసుగ్గా) రమ్మనిచెప్పడానికి నువ్వే వెళ్ళాలటోయ్.

చక్ర : మరేం చెప్పమంటారు?

చిద : ఇదిగో, ఈ నోటు అతను రాసిచ్చిందేనా?

చక్ర : ఏమో, సంతకం చూడండి...

చిద : (కోపంగా) ఓయ్ మొద్దూ! సంతకం చూసే చెప్తున్నా నోయ్! అతను రాసిచ్చిందే! నోటు లిఖితే

షన్‌పట్టే సమయం వచ్చేసింది. తక్షణం డబ్బు అసాల పైసలతో సహా చెల్లించమను. లేకపోతే చిక్కుల్లో పడతాడని ఖచ్చితంగా చెప్పేసెయ్?

చక్ర : ఇప్పుడే వెళ్తానండీ! నోటు తీసుకెళ్ళి చూపించమంటారా?

చిద : (కోపంగా) నీవంటి తెలివితక్కువ దద్దమ్మను నేనెక్కడా చూళ్ళేదోయ్. ఈ నోటు అక్కడికి తీసుకెళ్తే, మంచిమాటలతో దాన్ని చేజిక్కించుకుని, ముక్కముక్కలు చేసి కాల్చేస్తే. అప్పుడేంచేస్తావు? ఆపాటి లోకజ్ఞానం లేని నీతో యెలా చచ్చేదోయ్.

చక్ర : అదీ నిజమేనండి. (నిష్క్రమిస్తాడు.)

చిద : ఏంరా ఆనంద్! ఆఫీసుకి ఈవేళ శెలవిచ్చారా?

ఆన : లేదు నాన్నా... నేనే శెలవు పెట్టాను.

చిద : ఇప్పుడెందుకు శెలవు?

ఆన : బావ వున్నాడని... ఈరోజే వెళ్ళిపోతున్నాడుగదా! యీ ఒక్కపూటయినా హాయిగా గడిపేద్దామని.

చిద : (రుసరుసలాడుతూ) ఓహో అలాగా. అంత అభిమానమున్నవాడివి యేకంగా వుద్యోగానికి రాజీనామా యిచ్చేసి, మీ బావవెంట వెళ్ళిపోకూడదూ? జీవితాంతం హాయిగా, సరదాగా గడిపేయొచ్చునే!

ఆన : ఏమిటి నాన్నా మీ అక్కసు? బావనిచూస్తే, యెందుకలా రుసరుసలాడతారో నాకు అర్థంకావడం లేదు. అతనేం తప్పుచేశాడని?

చిద : నీకు నేను సంజాయిషీ చెప్పుకోవాలా యేమిటి? బావుంది... బావుంది... గ్రుడ్డొచ్చి పిల్లను వెక్కిరించిందట!

ఆన : నేను మిమ్మ సంజాయిషీ అడగలేదే! పోనీ, మీరన్నమాట ఏమైనా సబబుగా ఉందేమో. యెవర్నయినా అడగండి?

చిద : (వెటకారంగా) యెవరినో అడగడమెందుకు? న్యాయమూర్తివి ప్రత్యక్షంలో నువ్వున్నావుగా! బేసబబుగా వుందని చెప్తూనే వున్నావాయె.

రామే: (కలిగించుకొని) నా గురించి మీరిద్దరూ వాగ్వివాదాలు పెంచుకోవడం యెందుకులెండి మావంగారూ!

చిద : (ఉద్రిక్తుడై) తగిలించి తమాషా చూస్తున్నావేమిటోయ్!

రామే: (బిత్తరపోయి) ఏవిటి మీరంటున్నది? నేను తగిలించానా?

చిద : కాకపోతే ఏవిటీ, ఒక్కనాడు కూడా నా ముందు పల్లెత్తు మాట అనడానికి ధైర్యం చెయ్యని ఆనంద్ ఈనాడు నన్నెదిరిస్తున్నాడంటే యేమనుకోవాలి?

ఆన : ఎవరు మిమ్మల్ని ఎదిరించారు నాన్నా? ఉన్న మాటంటే, యెదిరించినట్టా? అగ్నిసాక్షిగా పెళ్ళాడిన

భార్యను తనవెంట తీసుకుపోవడానిక్కూడా బావకి హక్కులేకుండా మీరు ప్రవర్తిస్తుంటే, సహించలేక అన్నాను. అది యెదిరించా?

చిద : ఆమాత్రం నాకూ తెలుసులేవోయ్, నువ్వు నాకేం చెప్పనవసరంలేదు.

ఆన : బావ కాస్త మెత్తనివాడు, మంచివాడు అయిపోయాడుగాని, మరొహడైతే...

చిద : (చప్పున అందుకుని) మరొహడైతే, యేం చేస్తాడోయ్...?

రామే: దానికి సమాధానం నేనే చెప్తాను మావఁగారూ! నలుగురు పెద్దమనుషుల్ని చేర్చి. విషయాన్ని వారికి నివేదించి, బలవంతాన మీ చేతఒప్పించి, భార్యను విజయగర్వంతో తీసుకుపోయి వుందును.

చిద : (అసహ్యంగా) ఇంత తెలిసిన వాడివి నువ్వెందు కా పని చెయ్యలేదు?

రామే: చేతగాక కాదు. మీ గౌరవం, మీ మర్యాదా, మీ మంచితనం అన్నీ వీధిన పడతాయనీ, మీ నిజ రూపం నలుగురికీ తెలుస్తుందనీ ఆలోచించి వూరుకున్నాను. లేకపోతే మిమ్మల్నింత ప్రాధేయపడాల్సిన అవసరం నాకేముంది?

ఆన : మీ పట్టుదల పర్యవసానంగా, బావ చెల్లాయిని విడిచిపెట్టి వెళ్ళిపోతాడనుకోండి. శాశ్వతంగా తెగ

తెంపులు చేసుకుందుకు విడాకులు కోరతాడనుకోండి. అప్పుడు మీరేం చేస్తారు? కోర్టుల్లో తిరుగుతారా? ప్లీడర్లకి డబ్బుపోస్తారా? లేక బావని ప్రాధేయపడ తారా?

చిదం : (కోపాన్ని అణచుకోలేక పళ్ళుకొరుకుతూ)నోర్ముయ్ వెధవా! (ఛెళ్లున లెంపకాయ కొడ్తాడు) నిన్నివన్నీ యెవడు చెప్పమన్నాడు? అతని తరఫున వకాల్తా పుచ్చుకున్నావా ఏవిటి? పో లోపలికి...

రామే: (ఆనంద్ చెయ్యి పట్టుకొని తనవేపు లాగుతూ) ఇంత ఉద్రేకం పనికిరాదండీ మావఁగారూ!

చిద : (కోపంగా) నువ్వే వాణ్ణి రెచ్చగొట్టావు? నువ్వే!

[బైటనుండి చక్రపాణి రొప్పుకుంటు వస్తాడు]

చక్ర : కొంప మునిగిపోయిందండీ.

చిద : (ఆత్రుతగా) ఏమయ్యిందోయ్?

చక్ర : చెప్పడానికి నోరు రావడం లేదండీ!

చిద : నీ మొహం......! చెప్పవోయ్ వేగిరం... ఏమయ్యిందీ?

చక్ర : శేషాచలం రెండురోజుల క్రితమే యెవరికీ చెప్పకుండా యెటో పరారీ అయిపోయాడంటండీ!

చిద : (షాక్ తిని) పరారీ అయిపోయాడా? (హఠాత్తుగా చిదంబరంకి గుండెపోటు వస్తుంది. చేత్తో గుండెలు పట్టుకొని కూలబడుతూ వుంటే రామేశం పట్టు కుంటాడు. చిదంబరం చేతిలోనినోటు క్రిందపడుతుంది)

రామే: ఆనంద్! లోపలికి తీసుకుపోదాం పద! చక్రపాణీ! డాక్టర్ని త్వరగా తీసుకురా; (రామేశం, ఆనంద్ చెరోరెక్కపట్టుకుని భుజాలమీద వేసుకొని మెల్లగా చిదంబరాన్ని లోపలికి తీసుకుపోతారు... చక్రపాణి తొందరగా బైటికి వెళ్తాడు)

[క్షణం పోయాక చలంవస్తాడు.. సాధారణమైన దుస్తులు...మాసి వుంటాయి. మోహంలో దీనత్వం తాండవ మాడుతుంది. ఎవరూ అక్కడ లేకపోవడం చూచి ఆశ్చర్య పడతాడు]

చలం: ఆనంద్...ఆనంద్...?

ఆనం: (వస్తూ) నువ్వా చలం! ఏవిటలా వున్నావు? దుస్తులుమాసిపోయి వున్నా యేవిటి?ఎప్పుడూనీటుగా వుంటుండే చలం యిలా మారిపోయాడంటే, ఆశ్చర్యంగా వుందే!

చలం: (అదోలానవ్వి) కాలం నన్ను మార్చేసింది ఆనంద్! దాన్ని యెదిరించే శక్తి నాలో లేకపోయింది.

ఆనం: ఈ వేళ చాలా విచిత్రంగా మాట్లాడుతున్నావే! ఈ మధ్య వూళ్ళో లేవటగా?

చలం: ఊళ్ళోనే వున్నాను ఆనంద్. కాని, యెవర్నీ కలుసుకోవడం లేదు. కలుసుకోవాలని బుద్ధిపుట్టడం లేదు. ఎక్కడికీ వెళ్ళడం లేదు. జీవిత పోరాటంలో చిత్తుగా ఓడిపోయానేమో ననిపిస్తుంది. జీవించాలన్న వాంఛ, వుత్సాహం, క్రమంగా క్షీణిస్తున్నాయి. కాని అమ్మ,

తమ్ముడు నామీద ఆధారపడి వున్నారు. వారికోసమైనా జీవించాలిగా.

ఆనం : నీ మాటల ధోరణి నాకేం అర్థం కావడంలేదు. బొత్తిగా మనసు జారబెట్టుకుంటున్నావేవిటి? అరె... నిల్చుండి పోయావే... కూచో.

చలం: వద్దులే ఆనంద్. మీ నాన్నగార్ని కలిసి పోదామని వచ్చాను.

ఆనం : ఎందుకు? ఏమన్నా పనుందా!

చలం: ఉంది ఆనంద్. (నిట్టూర్చి) మీ నాన్నగారిని పూజ్యులుగా భావించాను. స్నేహితుడి కొడుక్కేనా మా అన్యాయం చెయ్యడన్న ఓ నిచ్చితాభిప్రాయాన్ని యేర్పర్చుకున్నాను. అందుకే ఆయనేంచెబితే అదే నమ్మాను. ఆయన యేంయిస్తే అదే సంతోషంతో తీసుకున్నాను. కాని... కాని... తర్వాత తెలిసింది ఆయన నన్ను మోసగించారని.

ఆనం : (ఆశ్చర్యంగా) మోసగించారా!

చిద : ఔను ఆనంద్, మోసగించారు. తప్పుడు లెక్కలు వేసి, ఫోర్జరీ ప్రాంసరీనోట్లు బనాయించి, నాకు న్యాయంగా రావల్సిన భాగంలో చాలా మట్టుకు కాజేశారు. నా కళ్ళల్లో కారంకొట్టి, స్వార్థానికి బానిసై, పాపపుణ్యాల్ని ఓ పక్కకునెట్టి, నాకూ, నా కుటుంబానికీ తీరని అన్యాయం చేశారు.

ఆనం: ఇవన్నీ నిజమా చలం?

చలం: నిజమే ఆనంద్! మీ నాన్నగారిమీదుండే గౌరవం కొద్దీ మొదట్లో నేను నమ్మలేకపోయినా, తర్వాత నమ్మాల్సి వచ్చింది.

ఆనం: అందుకు నేను చాలా విచారిస్తున్నాను చలం. బాధ పడకు. న్యాయం ఎప్పటికైనా విజయం సాధిస్తుంది. సూర్యకిరణాలకు చీకటి అడ్డొస్తుందా!

చలం: ఏవింటోలే! అవన్నీ కథల్లో చదవటానికే ఉపయోగిస్తాయి. వాస్తవిక జీవితంలో వాటికి స్థానంలేదేమో! సరేలే, అవన్నీ యిప్పుడెందుకుగాని, మీ నాన్నగార్ని ఓసారి పిలుద్దూ!

ఆనం: ఇప్పుడే ఆయనకు గుండెల్లో నొప్పివచ్చింది చలం. రెండు రోజులుపోయాక ఓసారి రాకూడదూ?

చలం: అరె అలాగా! పాపం. పెద్దకాలంకదూ! ఐ యామ్ సారీ! యిల్లాంటి సమయంలో వచ్చినందుకు సిగ్గు పడుతున్నాను ఆనంద్.

ఆనం: తెలిసి రాలేదుగా! దానికి నువ్వేం చేస్తావులే!

చలం: మరి నే వస్తా...

ఆనం: మంచిది చలం. కాని, ధైర్యం చిక్కబట్టుకొని జీవితాన్ని గడపడం నేర్చుకో!

[అదోలా నవ్వి చలం వెళ్ళిపోతాడు. ఆనంద్ రెండడుగులు ద్వారంవరకు వెళ్ళి తిరిగి వస్తాడు. అతని కళ్లు ఆర్ద్రిస్తాయి. రుమాలు తీసి కళ్ళొత్తు కుంటాడు ఇంతలో డాక్టర్, చక్రపాణి వస్తారు.]

ఆనం : (వారిని చూసి) రండి డాక్టరుగారూ!

డాక్ట : ప్రమాద మేం లేదుకదా!

ఆనం : అది మా కెలా తెలుస్తుందండీ! పదండి లోపలికి.

[డాక్టర్ చంద్రం, ఆనంద్, లోపలికి వెళ్తారు. చక్ర పాణి అక్కడే పడివున్న నోటు తీస్తాడు.]

చక్ర : (విచారంగా) ఎంతపని చేశావయ్యా శేషాచలం? నువ్వు పరారీ అవ్వడంవల్లగదా, అయ్యగారికి ఈ ఆపద వచ్చింది! నేనా సంగతి చెప్పకపోయినా బావుణ్ణేమో! తెలవితక్కువవాణ్ణి! వెంకటరమణ మూర్తి! అయ్యగారికి యే ప్రమాదమూ రాకొండా కాపాడు తండ్రీ! (ఇంటికప్పువేపు చూస్తూ దండం పెడతాడు).

[లోపల్నుంచి డాక్టరు, రామేశం, ఆనంద్ వస్తారు]

రామే: డాక్టరుగారూ! మ రేమీ ప్రమాదం లేదంటారా?

డాక్ట : ప్రస్తుతానికి ప్రమాదమేమీ లేదనుకోండి. కాని, యికముందు కాస్త జాగ్రత్తగా వుండటం శ్రేయస్కరం. ఆయన ఉద్రేకం తెచ్చుకోకుండా చూడాలి! ఆకస్మాత్తుగా శుభవార్తగాని, దుర్వార్తగాని ఆయనతో చెప్పకూడదు. ఇల్లాంటివన్నీ కాస్త 'అబ్జర్వ్' చెయ్యాలి మరి.

రామే: అలాగేనండి.

డాక్ట : ఆనంద్‌గారూ, నాతో రండి... మందిస్తాను.

ఆన : అలాగే... పదండి.

[డాక్టరు, ఆనంద్, నిష్క్రమిస్తారు]

చక్ర : (నోటు రామేశంచేతి కిస్తూ) ఇదిగోండి బాబూ! ఈ నోటే యింత ప్రమాదం తెచ్చిపెట్టింది.

రామే: చక్రపాణిగారూ. మీా రెప్పుడైనా, ఇట్లాంటి విషయాలు అంతఆత్రుతతో చెప్పకూడదండీ! మామూలు మనుషులమే గుండె జారబెట్టుకుంటాం గదా. గుండె జబ్బున్న మావఁగారి స్థితి ఆలోచించండి.

చక్ర : ఇప్పుడు తెలిసింది కదండీ! ఇక ముం దెన్నడూ అలా జరగదు.

[రామేశం లోపలికి వెళ్తుంటాడు, చక్రపాణి ఆఫీసు గదిలోకి వెళ్తుండగా]

— తెర —

# కరిగిన శిల

## రెండవ రంగము

[రంగస్థలంలో మార్పు వుండదు. చిదంబరం సోఫాలో కూచుని దినపత్రిక చదువుతూ వుంటాడు. అకస్మాత్తుగా అతనికి ఏదో జ్ఞప్తికివస్తుంది....తృళ్ళిపడినట్లుగా ముందుకి వంగుతాడు.]

చిద : చక్రపాణీ!

చక్ర : (దూరంలో) వస్తున్నానండీ! (వస్తూ) బాబూ!

చిద : శేషాచలం ఉనికి యేమన్నా తెలిసిందోయ్?

చక్ర : తెలవలేదండీ! అయినా, తమ రా విషయంగురించి మథనపడ్డం మానేయండి బాబూ! ఎప్పుడో అత నీవూరు వచ్చినపుడే తేల్చుకుందాం. ఆలోచనలు అధికంగా పెట్టుకోవద్దని డాకరుగారు చెప్పారు కూడాను.

చిద : (లేచి పచారుచేస్తూ) అందరూ అన్నీ చెప్తారోయి! చెప్పడానికేం? మాటకి టాక్సు ఉంది కనుకనా? వాళ్ళ కేం తెలుసు, నా బాధేవిటో? ఒకటా, రెండా! ఐదు వంద లిచ్చాను. ఓ రెండు సైకిళ్ళు కొని షాపులో పెట్టుకుంటానని కాళ్ళా వేళ్ళా పడితే, కనికరించి ఇచ్చాను. ఇదిగో అదిగో అంటూ

ఇప్పటివరకు ఈడ్చేశాడు. నోటు లిమిటేషన్ పట్టే సమయం వచ్చేసరికి రెండో ప్రాణికి తెలియకుండా పరారీ అయ్యాడు. ఇంక ఈ మనుష్యుల్ని యెలా నమ్మేది? ఈ అయిదువందలకీ నీళ్ళధార పెట్టేసి ఆలోచనలు లేకుండా ఎలా ఉండేది ?

చక్ర : మా బాగా టోకరా యిచ్చాడండీ ! మన ఒక్కరి దగ్గరే కాదటండీ! యింకెవరిదగ్గరో తీసుకున్నాడట కూడాను.

చిద : ఒకరి విషయాం మన కెందుకు లేవోయ్ ! మనదగ్గర తీసుకొన్నది మన మొహాన పారేస్తే పోయేదిగా.

(శంకరయ్య వస్తాడు)

శంక : (వస్తూనే) నమస్కారమండీ చిదంబరంగారూ !

చిద : రావోయ్...కూచో! (సోఫాలో కూచొని) ఏవిటిలా వచ్చావు?

శంక : (కూచుని) మీ ఆరోగ్యం ప్రస్తుతం ఎలా ఉంది ? ఆరోజు నేను వెళ్ళిపోయింతరువాత మీకు గుండె పోటు వచ్చిందటగా! నిన్నటివరకూ నా కా సంగతి తెలీనేలేదండీ ! తెలిసింది మొదలుగా మిమ్మల్ని చూడాలన్న తలంపుతో ఉంది. యిప్పుడిలా రెక్కలు కట్టుకొని వచ్చేశాను.

చిద : ఔను శంకరయ్యా ! ఆరోజు ఉపద్రవంగా నొప్పి వచ్చిందోయ్.

శంక: మీలాంటి గుండెదిటవు మనిషికే గుండె జబ్బు పట్టుకుందంటే, ఆశ్చర్యంగా ఉందండీ.

చిద : ఆశ్చర్య మేముంటి లేవోయ్ ? అది నా ఖర్మ. ఆ రోజైనా ఆ నొప్పి రాకపోను. ఆ శేషాచలం వేధన లేగా ... ?

శంక : (చప్పున అందుకొని) లేడండీ ! ఎక్కడికో పరారీ అయిపోయాట్టగా ! నా కొట్టులో ఓ పది రూపాయల వరకూ అరువు పెట్టేసి పోయాడండీ !

చిద : పది రూపాయలకేం లేవోయ్ ? నాదగ్గర తీసుకు వెళ్ళినవి అయిదు వందలు... ! ఒకటా, రెండా ? వాటికి నీళ్ళధార వదులుకోవల్సిందే!

శంక : అయిదు వందలే ! నోటు రాయించుకోకుండా వాడి కిచ్చారా ?

చిద : అంత తెలివితక్కువవాణ్ణి కానోయ్. నోటు రాయించాను. అది లిమిటేషన్ పట్టే సమయం వచ్చేసింది. యిన్నాళ్ళు పొరపాటున నే నది చూసుకోలేదు. యిప్పుడేమో, అతడి జాడ తెలీకండా ఉంది.

శంక : అల్లాంటివాళ్ళకి, అసలు అప్పు లివ్వనేకూడదండీ.

చిద : యివ్వకూడదు. నిజమే ! కాని వా డిల్లాంటి దగాకోరని మొదట్లో ఎవరికి తెలుసు ? పై పై వేషం చూసి మంచివాడే గావునని యిచ్చాను.

శంక : (ఏదో జ్ఞాపకంవచ్చి లోపలి ద్వారంవేపు చూస్తాడు) మీ అల్లుడుగా రున్నారా ?

చిద : (నవ్వి) ఆ పక్క బెరుకు పోలేదన్నమాట.

శంక : ఎలా పోతుందండీ! యిప్పటికీ అతని ఆకారం కళ్ళల్లో మెదుల్తూనే ఉంది,

చిద : వెళ్ళిపోయాడు లేవోయ్.

శంక : అమ్మాయిని పంపించేశారా ?

చిద : లేదోయ్. దానికి వంట్లో బాగులేదు మందులిప్పించాలని ఉంచేశాను

శంక : మంచిపని చేశార్లెండి.

చిద : అన్నట్టు శంకరయ్యా కొండయ్యదగ్గర్నుంచి ఆ ధాన్యం పట్టించుకు పోయినట్టేనా ?

శంక : మన్నించండి. అదే చెప్పడం మర్చిపోయాను. ఆరోజే పట్టించుకు పోయాన్లెండి. నేను డబ్బు పట్టుకెళ్ళేసరికి, కొండయ్యగారి మొహం అంతా కత్తి వేటుకు రక్తపుచుక్క లేదంటే నమ్మండి.

చిద : నువ్వు డబ్బుతీసుకెళ్తావన్న నమ్మకం అతనికి లేకపోయిందేమో !

శంక : (మందహాసంతో) ఈ శంకరయ్య సంగతి అతనికి పూర్తిగా తెలీదండీ !

చిద : (నవ్వి) గొప్పవాడివేగాని, యిందులో నీకు ఏ మాత్రం లాభం ఉంటుందోయ్ ?

శంక : అబ్బే ! ఏం లాభ ముంటుందండీ ? యిందులో బోలెడు ఖర్చులున్నాయి. మీ వడ్డీ కొంత పోతుందిగా ! ఏదో, వ్యాపారం కుంటుపడకుండా సాగిస్తుండడంకోసమే కొన్నాను గాని, లాభసాటిగా ఉంటుందని కాదులెండి.

చిద : ఎందుకోయ్ అబద్ధాలు చెప్తావు ? యిప్పటికే ముగ్గు

రాడపిల్లలు. యింకా పుట్టగలరు ... (చిన్నగా నవ్వుతాడు)

శంక : ఇంక ఆడపిల్ల లొద్దండోయ్ బాబూ. ఇప్పటికే కట్నాలిచ్చుకోలేక చస్తున్నాను. మొన్ననే పెద్ద మ్మాయికి పెళ్ళి చేశానా — పెళ్ళి ఖర్చులు, కట్నాలుమాట ఎలాఉన్నా, అల్లుడు వచ్చినపుడు యిచ్చుకునే కట్నాలు దుంప తెంచేస్తున్నాయి.

చిద : (నవ్వి) ఔనుగదా! అందుకే. ఆడపిల్లలు యింక పుట్టకుండా ఉండాలంటే అబద్దాలు చెప్పకు. ఈ వ్యాపారం ఏమన్నా లాభసాటిగా ఉంటే, నేనూ భాగస్వామిగా ఉండాలని చూస్తున్నాను.

శంక : అందుకా అడుగుతున్నారు ?

చిద : మరేమిటనుకున్నావు ?

శంక : (నవ్వి) వ్యాపార రహస్యాలు చెప్పకోడదు గదండీ? భాగస్వామిగా ఉంటానని మీరంటే చెప్పకుండా ఉంటానా ? లాభం ఉండకుండా వ్యాపార మెవరు చేస్తారండీ ? ఐదు వందలు పెట్టుబడి పెట్టామంటే, దగ్గర దగ్గర వంద రూపాయలు లాభ ముంటుం దండీ !

చిద : దేవాంతకుడివోయ్! ఈ వ్యాపారం బాగానే ఉన్న ట్టుందే! ఈసారి నువ్వు ధాన్యం కొన్నప్పుడు నాతో చెప్పవోయి - సగం డబ్బు నే నిస్తాను.

శంక : (సంతోషంతో) అలాగేనండీ ! మీలాంటివాళ్ళ నాతో చేయి కలపడం నా అదృష్టమేనండీ !

చిద : (నవ్వి) అలాగని, నన్ను ముంచెయ్యవుగదా !
శంక : ఎంతమాటన్నారు ?

(బైటనుండి డాక్టరు వస్తాడు)

డాక్ట : (వస్తూ) నమస్కారమండీ !
చిద : (నిల్చుని) రండి... రండి ... మీకోసమే యెదురు చూస్తున్నాను.
డాక్ట : మీ రిలా చిద్విలాసంగా మాట్లాడుకొని కూర్చున్నా రే! మరి నన్నెందుకు రప్పించారు ? అర్జంటుగా రమ్మని కబురు పంపించారుగా ?
చిద : ప్రస్తుతానికి నేను నిక్షేపంగా ఉన్నానండీ. మా అమ్మాయికి బాగులేదని కబురంపాను.
డాక్ట : ఓ, ఏమయిందేమిటి?
చిద : ఏమిటోనండీ ? రెండు రోజుల్నుంచి జ్వరమొస్తోంది. భోజనం చెయ్యదు. ఎవరితోనూ మాట్లాడదు. ఎప్పుడూ దిగులుగ ఉన్నట్టే ఉంటుంది.
డాక్ట : సరే ! పరీక్షిద్దాం...ఆఁ ... మీ ఆరోగ్యం బావున్నట్టేనా ?
చిద : ఇదిగో ఇప్పటికి బాగానే ఉన్నాను. ఏ క్షణంలో ఎలా ఉంటుందో మీరే చెప్పలేరుగా! (నవ్వుతాడు)
డాక్ట : మీరు కొంతకాలం విశ్రాంతి తీసుకోవడం ఎంతో అవసరమండీ! ఆ విషయం ఇంతకుముందే మీతో చెప్పాను. ఎప్పుడూ ఏవో వ్యవహారాలు బుర్రలో పెట్టుకొని నిర్విరామంగా ఆలోచించకూడదు.
చిద : నాకు తెలీ కడుగుతాను, డాక్టరుగారూ ! బుర్రలో

ఆలోచనలకీ, గుండెలో నొప్పికీ సంబంధం ఏవిటండీ ?

డాక్ట : సంబంధం ఉంది గనుకనే చెప్తున్నానండీ! డాక్టర్లం మాకు తెలుసు. మీా కవి ఎలా చెప్పడం ?

చిద : అంతే లెండి...పదండి లోపలికి.

(డాక్టరు, చిదంబరం, లోపలికి వెళ్ళారు. చక్రపాణి పక్క గదిలోనుండి ఏదో కాగితం తీసుకుని వస్తాడు.)

చక్ర : ఓ ! శంకరయ్యగారా !

శంక : ఆఁ...ఆఁ... ఏవిటి సంగతి ?

చక్ర : ఆఁ ! ఏముంది లెండి...అయ్యగా రెక్కడికి వెళ్లారు?

శంక : డాక్టరొచ్చాడు... లోపలికి వెళ్ళారు. మంచి సమయంలో వచ్చేరోయి డాక్టరు.

చక్ర : ఏమయ్యిం దిప్పుడు ?

శంక : చిదంబరంగారు నాతో వ్యాపార విషయాలు ప్రస్తావిస్తుండగా వచ్చేశాడు.

చక్ర : వ్యాపార విషయాలా ?

శంక : ఔనోయి నాతో కలిసి ఉమ్మడి వ్యాపారం చెయ్యాలని ఆయనకి అభిప్రాయం ఉందట.

చక్ర : మీాతోనా ?

శంక : ఏం ? నీ కాశ్చర్యంగా ఉంది కదూ? ఉంటుంది లే! కాని, ఆయన నాతో చెయ్యి కలపా లేగాని, ఎంత లాభం చూపిస్తానో తెలుసా ?

(లోపల్నుంచి డాక్టరుగారు, చిదంబరం వస్తారు)

డాక్ట : నేను రాసిచ్చినమాత్రలు తెప్పించండి. ప్రతీ నాలు

గంటలకీ ఓ మాత్ర ఇస్తూ ఉండాలి. నాతో ఎవ
రినైనా పంపిస్తే వేరే మందిస్తాను.

చిద : అలాగేనండి! ఇంతకీ, అమ్మాయికేం ప్రమాదం
లేదుకదా!

డాక్ట : ప్రస్తుతం ప్రమాదం లేదనుకోండి. కాని, కాస్త
జాగ్రత్తగా ఉండాలి.

చిద : ఏ ప్రమాదమూ లేకుండా చూడండి!

డాక్ట : డాక్టర్ల ప్రయత్నం అదేగదండీ! ఒక్క విషయం
—ఈమెకి మనోవ్యధ యేమైనా ఉందా?

చిద : (తడబడి) అబ్బే! అల్లాంటిదేవీఁ లేదండీ! నా ఇంట్లో
దేనికి లోటు చెప్పండి? తిండికిలోటా? గుడ్డకిలోటా?
ఆనందానికి లోటా? అసలు మొదట్నుంచీ దాని
ఆరోగ్యమే అల్లాంటిది.

డాక్ట : సరే వస్తానండీ మరి...

చిద : మంచిదండీ! చక్రపాణీ! అబ్బాయి యింకా
రాలేదు...నువ్వెళ్ళి కాస్త మందు తెచ్చిపెట్టవోయ్.

చక్ర : అలాగే నండీ!

[డాక్టరు, చక్రపాణి, నిష్క్రమిస్తారు. చిదంబరం
డాక్టర్ని ద్వారం వరకూ సాగనంపి భారంగా వచ్చి
సోఫాలో కూలబడతాడు.]

శంక : మన వుమ్మడి వ్యాపారం గురించి, తమరు చెప్తు
న్నంతలో డాక్టరు వచ్చేశారు. అంత ఉత్సాహమూ
గంగలో కలిసిపోయింది.

చిద : (విసుగ్గా) నీ స్వార్థం నీదేగా? యెదుటివారి బాధని అర్థంచేసుకోనోయ్ శంకరయ్యా!

శంక : (గతుక్కుమని) అదేవిటలా శలవిస్తున్నారు?

చిద : ఔను శంకరయ్యా! అమ్మాయి ఆరోగ్యం గురించే నాకిప్పుడు వ్యధ పట్టుకు బాధిస్తోంది. నామనస్సు పాడయ్యింది. ఖర్మంచాలక ప్రమాదం వాటిల్లిందంటే నేనేం అప్రతిష్టకు గురికావల్సి వస్తుందోనన్న భయం పీక్కుతింటోంది.

శంక : మీకెందుకండీ అప్రతిష్ట వస్తుంది? మిమ్మల్ని అనడానికి యెవరికైనా యెన్ని గుండెలుండాలి? వచ్చిన రోగాలకుమనం మందులిప్పించగలమేగాని, యింకేం చెయ్యగలం? మరి... నామాటశలవిచ్చారుగాదు...

చిద : (చిరుకోపంతో) అబ్బబ్బా! ప్రాణాలు తోడేస్తున్నావయ్యా! నేరక ఆ మాటన్నానుగాని, యిప్పుడేం బాధించకు. నా మనసేం బావులేదు, ఈసారి కలిసినప్పు డవన్నీ మాట్లాడుకుందాం.

శంక : సరే! అలాగే కానీయండి. మీమాట యెందుకు కాదనాలి? చికాకుల్లో వున్నట్టున్నారు. కాస్సేపు విశ్రాంతి తీసుకోండి. వస్తామరి... (వెళ్ళిపోతాడు)

చిద : (వెనక్కి చేరబడి) విశ్రాంతి! హుం... విశ్రాంతి తీసుకోడానికి సమయమేదీ? డాక్టరన్నట్టు ఇరవైనాలు గ్గంటలూ ఏదో ఒక సమస్య బుర్రలో మెసుల్తూనే

వుంటుంది. ఇప్పుడేమో, అమ్మాయి ఆరోగ్యం ఒక పెద్ద సమస్యయి కూచుంది. కొంపదీసి, అది బెంగ పెట్టుకుంది గామోసు. కాస్త ధైర్యం చెప్పాలి.(అని లోపలికి వెళ్తూండగా చలం వస్తాడు)

చలం: నమస్కారమండీ.

చిద : (వెనక్కితిరిగి రెండడుగులువేసి కళ్ళద్దాలు సర్దుకుని వింతగాచూస్తూ) ఎవరబ్బాయ్ నువ్వు? సరిగ్గా గుర్తు పట్టలేకపోతున్నాను?

చలం: నిజంగా గుర్తుపట్టలేకపోతున్నారా?

చిద : లేకపోతే, నీతో పరిహాస మాడుతున్నా నను కొంటున్నావేవిఁటోయ్?

చలం: మీ భాగస్వామిగా వుండి చనిపోయిన చంద్రశేఖరంగారి అబ్బాయిని.

చిద : (ముఖకవళికలు మారినా కోపాన్ని మరుగుపరుస్తూ) నువ్వా! ఎందుకొచ్చావు?

చలం: మిమ్మల్ని కలుద్దామని...

చిద : (గంభీరంగా) ఊఁ...సరే...కూచో.

చలం: ఫరవాలేదులెండి.

చిద : ఏవిఁటోయ్ నీ అవతారం? ఆ మాసినగడ్డం, మాసిన దుస్తులు... యేవిఁటిదంతా! ఇంతచిన్నవయస్సులోనే జీవితమ్మీద విరక్తి పుట్టిందా?

చలం: (బాధగానవ్వి) ఆ ఘనత మీకే దక్కుతుంది లెండి.

చిద : (షాక్తిని) అదేవిఁటోయ్ అలా అంటున్నావు! ఆ

ఘనత నాదా? నీకు జీవితమిచ్చిన విరక్తిపుడితే, అందుకు బాధ్యుణ్ణి నేనా? బావుంది... బావుంది...

చలం: (ఉద్రేకంతో) మా నాన్నగారి పెట్టుబడిలో సగం, తప్పుడు లెక్కలు సృష్టించి యెగ్గొట్టడం బావుందా? మిగిలినదాంట్లో కూడా మానాన్నగారు అప్పు తీసుకున్నట్టుగా ఫోర్జరీనోట్లు బనాయించి కొంత మింగేయడం బావుందా? ఏది బావుంది? మీరు మాకు న్యాయంగావచ్చిందంటూ యిచ్చింది మూడువేలేగా.

చిద: ఔను. లెక్కలన్నీ చూశాక మిగిలిందదేనూ. ఇందులో నేను అబద్ధం చెప్పడానికి, తప్పుడు లెక్కలు వేయడానికి, నాకేం అవసరముంది? నేనేం అంత మోసగాణ్ణి అనుకున్నావా? ఈరోజు నాదగ్గరా మాట అన్నావుగాని, ఇంకెప్పుడూ అనకబ్బాయ్? (సన్నగా నవ్వి) వుయసులో వున్నవాడివి. అనుభవంలేక అలా చప్పున అనేశావు. నువ్వు అన్నావని నాకు కోపం లేదనుకో. అయినా, విషయాన్ని సాంతం అర్థం చేసుకోకుండా, నోటికొచ్చినట్టు కూసేయడమేనా?

చలం: తేనెపూసిన తీపికబుర్లతోనే, మీరిలా యిన్నాళ్ళు, మోసగిస్తూ వచ్చారు. మీకు ఏ అపకారమూ చెయ్యని మా కుటుంబాన్ని సర్వనాశనం చేశారు. మీరెంతో సహృదయులని, పూజ్యులని, అన్యాయానికి దూరంగా వుంటారని, అనుకున్నాను. ఆ భావనతోనే మిమ్మల్ని నమ్మాను. కాని, మిమ్మల్ని అర్థం చేసుకోవడంలో తప్పటడుగు వేశానేమోనని

యిప్పుడు గుర్తిస్తున్నాను చిదంబరంగారూ! మనిషికి కావల్సింది కేవలం డబ్బు కాదండీ, ముఖ్యంగా కావలసింది నీతి. నీతిలేని మనిషిని ఏమనాలో బోధ పడ్డంలేదు.

చిద : (ఉక్రోషంతో) హద్దుమీరి వాగుతున్నావబ్బాయ్! నా యింట్లో నుంచుని నన్నే తూలనాడుతున్నావా? ఏమిటి నీ ధైర్యం? దీని పర్యవసానం యేమిటో, ఆలోచించావా?

చలం: ఆలోచించాను...యింక మిగిలివున్న పర్యవసానం యేమిటి? కొట్టిస్తారు, మీ యింటికి వచ్చానని అవమానిస్తారు...అంతేనా? అంతకంటె మీరు చేయగలిగిందేముంది? మీ యిష్టం...అదే కానీయండి. ప్రజలందరికీ తెలియనీయండి. అందరి నోట మీరు మాకు చేసిన అన్యాయం నెనురుపడనీయండి...అంతవరకూ వస్తే కోర్టులోనే వ్యవహారం తేల్తుంది.

చిద : (గతుక్కుమని) కోర్టులోనా!

చలం: ఔను! కోర్టులోనే; ఏం – భయంగా ఉందా? అన్యాయానికి భయపడని మీరు అధికారానికి భయపడుతున్నారా?

చిద : (సంబాళించుకుని) భయం దేనికోయ్! కోర్టులో కేసు పెడతావా? పెట్టు...అక్కడ కూడా పాత రికార్డులే చూపిస్తాను నాకేం భయమనుకున్నావా?

చలం: మనస్ఫూర్తిగా చెప్తున్న మాటలేనా యివి? అంత

రాళంలో ఓ మూల భయం పొంచివున్నా, లేని ధైర్యం తెచ్చుకొని ప్రగల్భాలు పలుకుతున్నారా?

చిద : అని నువ్వనుకుంటున్నావుగామోసు? నాకేం భయం లేదు... ఈ చిదంబరం - తాటాకు చప్పుళ్ళకు ఝడిసే మనిషి కాదు... నీ యిష్టమొచ్చినట్టు చేసుకో!

చలం: మీ గుండె ధైర్యం నాకు తెలీదు గనుకనా! చిదంబరంగారూ, కోర్టులో కేసు పెట్టడం యేమంత గొప్ప విషయం కాదు. కాని, దానివల్ల అందరికీ కలిగే కష్టనష్టాల్ని కాస్త స్మరించుకోవాలి. అందుకే ఆలోచిస్తున్నాను. ఒక్కసారి గతాన్ని గుర్తుకు తెచ్చుకోండి. మా నాన్నగారితో మీరెంత స్నేహంగా వుండేవారో, మీ యిరువురి అనుబంధం, ఎంత బలియంగా వుండేదో, ఊహించుకోండి. అల్లాంటి స్నేహితుడికి సన్నిహితునికి, అపకారం చెయ్యడానికి మీకు యెలా మనస్కరించిందో, నాకు అర్థంకావడం లేదు. ఆయన మొహం మరిఅగుపించదని ధైర్యమా?

చిద : (అదోలా నవ్వి) కోర్టులో కేసు పెడతానని గొంతు చించుకొని చెప్పినవాడివి, ఒక్కసారిలా ప్రాధేయత లోకి దిగిపోయావేం?

చలం: మీ మంచిని కోరే!

చిద : (నవ్వి) నా మంచిని కోరా! బావుంది... బావుంది!

చలం: ఔను! మీ మంచినికోరే! మీరు అబద్ధపు లెఖ్ఖలు సృష్టించారనీ ఫోర్జరీ ప్రాంసరీనోట్లు బనాయించారనీ, తప్పకుండా కోర్టులో ఋజువౌతుంది. తగిన సాక్ష్యా

లున్నాయి గనుక చెప్తున్నాను. అప్పుడు మీ గౌరవమూ, మీ హోదా, మీ పేరు ప్రతిష్ఠలు సంఘంలో ఎలా దెబ్బతింటాయో, యోచించారా? అంతేనా? మీకు శిక్ష తప్పదు... అయినా డబ్బుంది కాబట్టి, యెలాగో ఆ వాతావరణంనుంచి బైటపడతారు. కాని... మీరు మళ్లీ నలుగురిలో మొహం మెత్తుకు తిరగగలరా!. ఆ అప్రతిష్ట మీ ఒక్కరితో పోయేదికాదు. మీ వంశానికి అదో తీరని కళంకం అవుతుంది. పర్వత శిఖరాగ్రాన వున్న మీ కుటుంబ గౌరవం ఒక్కసారి అగాధంలోకి విసిరివేయబడుతుంది. ఎన్ని అనర్థాలున్నాయో, ఆలోచించారా! నా మాట విని నాకు రావల్సింది న్యాయంగా ఇచ్చేయండి.

చిద : (నుదుటిమీద చిరుచెమట తుడుచుకొని) నీకు పిచ్చెత్తినట్టుందోయ్... లేకపోతే యేమిటా ప్రేలాపన! వెళ్ళిక... వెళ్ళు.

చలం: ఔను నాకు పిచ్చెత్తింది... కాదు... పిచ్చెత్తించారు మీరు. అవకాశం చిక్కిందని, మాకు అన్యాయం చేసి డబ్బు అపహరించారు. ఆ డబ్బుతో మీరు మాత్రం ఏం సుఖంగా ఉండగలరు? ఇచ్చేయండి, మాకు రావల్సిన వాటా సవ్యంగాయిచ్చేయండి... లేకపోతే... లేకపోతే...

చిద : ఏమిటి చేస్తావు?

చలం: చేసేదేముంది? ఆఖరి ప్రయత్నం ఒక్కటే. కోర్టులో

కేసు పెడతాను. ఇప్పటికే నాశనమయ్యాం. ఇంకా సర్వనాశనమైపోయినా ఫరవాలేదు. తలవరకు మునిగిన వాడికి చలేమిటి చెప్పండి? ఓసారి ఆలోచించుకోండి! మళ్లీ వచ్చి కలుస్తాను. మీకు సంఘంలో వున్న గౌరవం, ప్రతిష్ఠ అన్నింటికీ మించిన వంశగౌరవం... యివన్నీ దృక్పథంలో వుంచుకుని తీవ్రంగా ఆలోచించండి వస్తా... (విసురుగా వెళ్ళిపోతాడు.)

చిద : (విసుగ్గా, చిరుకోపంతో, ఇటూ అటూ పచారు చేసి) తుఫానులా వచ్చిపోయాడు వెధవ...! ఎంత గుండె ధైర్యం? నా యింటికి వచ్చి నన్నే బెదిరిస్తాడూ? వీడికీ బుద్ధి స్వతహాగా పుట్టింది కాదు, యెవడో రేకెత్తించాడు. తెర వెనుక నాటక మాడుతుం దెవరో తెలిస్తే వాడి అంతు చూసేవాణ్ణి. ఎలాగో నమ్మించాను కదా అని మొదట్లో సంతోషించాను. ఇప్పుడేమో వీడు కోర్టులో కేసు పెడతానంటున్నాడు. అవుతే కాస్త మెలుకువుగా వుండాల్సిందే! ఎలాగో మెల్లిగా వీణ్ణి మంచి చేసుకుని, ఆ ప్రయత్నం మాన్పించడమే వుత్తమంగా అగుపిస్తోంది. తండ్రి లాంటి మెతక కాదు... మెరుపులాంటివాడు వీడు. తండ్రికి పేరు తేవాల్సినవాడు. నా కొడుకూ వున్నాడు ఎందుకూ? హుఁ... నన్ను విమర్శించడానికి... అవసరమైతే యెదిరించడానికీను... చవట!

[అప్పుడే బైటినుండి ఆనంద్ వస్తాడు]

ఆన : (వస్తూనే)ఏమిటి నాన్నా, చవట అంటున్నారు...? ఎవర్ని ? చలాన్నేనా ?

చిద : (గతుక్కుమని) ఆఁ... ఆఁ... వాణ్ణే...

ఆన : మీ యిద్దరికీయేమన్నా ఘర్షణ జరిగిందా యేమిటి ? గొప్ప ఉద్రేకంతో వెళ్తున్నాడు ?

చిద : అబ్బే ! ఘర్షణ జరగడానికి కారణ మేముంటుందిరా? చిన్నవాడు గాబట్టి, తెలీక యేదో వాగుతుంటాడు.

ఆన : వాళ్ళ నాన్నగారు మీతో భాగస్వామిగా వున్నప్పుడు పెట్టిన పెట్టుబడిలో కొంత అన్యాయంగా మీరు కాజేశారని అంటాడేవిఁటి ? నిజంగా అల్లాంటిదే జరిగినట్టవుతే వాళ్ళకి వెళ్ళవలసిన డబ్బు, యిచ్చేయండి నాన్నా ! పాపం, చాలా చిక్కుల్లో వున్నారు !

చిద : (కోపంగా) నువ్వొక చవటవిరా ! నేను మోసం చేసి డబ్బు కాజేశానని ఏ వెధవైనా అంటే నువ్వేలా నమ్మావూ అంటా ?

ఆన : చలం చాలా మంచివాడు నాన్నా ! అకారణంగా యెవర్నీ నిందించవల్సిన మనిషి కాదు. అల్లాంటి వాడు చెప్తుంటే, నమ్మక యేంచేసేది ?

చిద : (చిందులు తొక్కుతూ) నమ్ముతావు. యెందుకు నమ్మవు ? పరాయి వాళ్ళయందుండే నమ్మిక, గౌరవం, కన్నతండ్రి మీద లేకపోయినందుకు సిగ్గుపడకండా నమ్ముతాడట ... నమ్ముతాడు. ఛీ; ఛీ; నీ లాంటికొడుకువున్నా ఒకటే... లేకపోయినాఒకటే.

ఆన : అంత ఆగ్రహం యెందుకు నాన్నా ! అందరూ మీ గుణగణాల్ని చెప్పుకొని విమర్శించుతుంటే, మేం మాత్రం మొహమెత్తుకుని నలుగురిలో తిరగ్గలమా చెప్పండి ?

చిద : (కటువుగా) తిరగలేకపోతే, పురి పోసుకో !

ఆన : ఆ రోజు వస్తే తప్పుతుందా మరి ! సరేలెండి. మీతో వాదన అనవసరం. ఏ విషయంలో మీరు కరిగారని ? ఎప్పుడూ వున్న పట్టుదలేకదూ ? దేనికైనా ఒక హద్దంటూ వుంటుందిగాని మీ పట్టుదలకి మాత్రం హద్దులేదు. అతడు కోర్టులో కేసు పెడతానంటు న్నాడు. అప్పుడు కోర్టుల చుట్టూ, నల్లకోట్ల చుట్టూ తిరిగి, వేలకి వేలు ఖర్చు పెడితేనేగాని, మీకు తృప్తిరానట్టుంది.

చిద : (వెటకారంగా) కేసు పెడితే, నువ్వు వాడి తరపున సాక్ష్యం చెప్పు. సిగ్గు లేకపోతేసరి ! తగుదునమ్మా అని చెపుతున్నా వింకా... నోరు మూసుకో.

ఆన : (తేలిగ్గా) పాతపాటే ! (లోపలికి పోతుంటాడు)

చిద : (ఏదో జ్ఞప్తికి వచ్చి) ఇదిగో... విజయకి బాగులేదని మీ బావకి వుత్తరం రాశావేమిటి ?

ఆన : లేదింకా ! రేపు రాయాలని అనుకుంటున్నాను.

చిద : నాకు తెలీదూ. నువ్వనుకుంటావు ? అక్కచెల్లెళ్ళ అభిమానం చాలించు. రేపుకూడా రాయొద్దు, అసలు వుత్తరం రాయనే వొద్దు ....

ఆన : (వింతగా) మరి...?

చిద : అంతగా ప్రమాదకరమైతే, అప్పుడే టెలిగ్రామ్ యిద్దాం.

ఆన : (పళ్ళు పటపట కొరుకుతూ) మీరు మనుషులా లేక... లేక...

చిద : (అందుకుని) లేక... పశువులా? అనేయరా ఆ మాట కూడా! అను... నీచేత యీ మాటలన్నీ అనిపించు కుందుకేగా. కన్నాను ... పెంచాను ... చదువు చెప్పించి ప్రయోజకుణ్ణి చేశాను! (ఆనంద్ నిర్లక్ష్యంగా లోపలికి పోతాడు) వింటున్నావా భగవాన్! తండ్రికి కొడుకిచ్చే విలువ యిది. ఇలావుంది ప్రపంచం! యుద్ధాలు, కాటకాలు, గాకుండా విశ్వశాంతి కావాలంటే, యెలా వస్తుంది? విపరీత కాలం... !

(చక్రపాణి వస్తాడు)

చిద : డాక్టరు యింకేమన్నా చెప్పాడోయ్?

చక్ర : లేదండీ!

చిద : సరే; లోపలిచ్చేయ్ మందు.

(చక్రపాణి లోపలికి పోయి క్షణంలో తిరిగి వస్తాడు)

చక్ర : (సవినయంగా) బాబుగారూ!

చిద : ఏమోయ్?

చక్ర : నా జీతం పెంచుతామని ఆ మధ్య అన్నారు కదండీ!

చిద : ఆ విషయం అడగడానికి యిదేనా యేమిటి సమయం?

నేను కష్టాల్లో వుంటే, అడగడానికి నీకు నోరెలా వచ్చిందోయ్?

చక్ర: నాకు జ్ఞాపకం రావటమే ఓ గొప్ప విషయమండీ! ఇప్పుడే జ్ఞాపకం వచ్చింది గాబట్టి అడిగాను. బజారులో సామాన్ల ధరలు యెలా పెరిగి పోతున్నదీ మీకు తెలీని విషయం కాదు.

చిద: (నిష్కర్షగా) చూడు చక్రపాణీ! ప్రస్తుతం యిస్తున్న జీతం కంటే ఒక్క నయాపైసా అయినా అధికం యివ్వను. అందుకు నీకు సమ్మతిగా లేకపోతే, వేరే చోట వుద్యోగం చూసుకోవచ్చు. తెలిసిందా?

చక్ర: (సాధేయంగా) మీరంత నిర్దయగా చెప్తే, మాలాంటివాళ్ళ గతేమిటండీ? పిల్లలు గలవాణ్ణి, మీరు కాస్త కనికరించాలి!

చిద: ఉద్యోగమే ఆవకతవకలుగా వుంటే, నిన్నెవడు పిల్లల్ని కనమన్నాడోయ్?

చక్ర: అదే పొరపాటయ్యిందండీ!

చిద: పొరపాటయ్యిందీ! అవుతే, యిప్పుడేడు...!

చక్ర: మీరు చెప్పినా, చెప్పకపోయినా, నేను యేడుస్తూనే వున్నానండీ! నేను అనుభవిస్తున్న యాతన మీకేం తెలుసు?

చిద: (విసుగ్గా) తెలీదుగానీ, ప్రస్తుతం నోరు మూసుకుంటావా లేదా?

చక్ర: చిత్తం... (గదివేపు వెళ్ళబోతాడు)

చిద: అన్నట్టు ఒకమాటోయ్...

చక్ర : (ఆగి, వెనక్కి తిరిగి వస్తూ) చెప్పండి బాబూ!

చిద : ఆ శంకరయ్యతో చెయ్యికలిపి, వుమ్మడిగా ధాన్యం వ్యాపారం సాగించాలని వుంది. నీ వుద్దేశం యేవిటోయ్?

చక్ర : వ్యాపారం లాభసాటిగానే వుంటుంది గానీ ... శంకరయ్యను నమ్మలేమండీ!

చిద : ఏం? మంచివాడు కాడా?

చక్ర : అంత నమ్మకస్తుడు కాదని, మీకెలా తెలుస్తుంది? మీరెంతసేపూ అమాయకుణ్ణే అన్యాయం చేస్తారు గాని ...

చిద : (చప్పున అందుకుని) నోరు ముయ్యవోయ్... ?

చక్ర : (నాలిక కర్చుకుని) తప్పయింది క్షమించండి. శంకరయ్య బైటికి అలా అమాయకంగా అగుపిస్తాడు గాని, నిజానికి నక్కజిత్తుల మనిషండీ! అన్నీ మాయలే. నేను ఆసుపత్రినుండి వస్తుంటే చూశాను... యేదో అవసరం వుంది గామోసు, రాఘవయ్యగారింటికి వెళుతున్నాడండీ!

చిద : (షాక్ తిన్నట్టు) రాఘవయ్యగారింటికా?

చక్ర : ఔనండీ! నేను కళ్ళారా చూశాను. నన్ను చూడ్డంతోనే మనిషి నీరైపోయాడంటే నమ్మండి.

చిద : రాఘవయ్య నాకు విరోధి అని తెలిసికూడా వాళ్ళింటికి వెళ్ళాడా? ఎంత ధైర్యం? ఆర్థిక సహాయం పొందడం నాదగ్గర... అవసరమైన సలహాలు పొందడం ఆయన దగ్గరానా? వీడి చాతుర్య మేవిటో

నేనూ చూస్తాను. నువ్వెళ్ళి శంకరయ్యని తక్షణం పిల్చుకురా.

చక్ర : ఇంకా రాఘవయ్య యింట్లోనే వుంటాడేమోనండీ !

చిద : ఈసరికి వచ్చేస్తాడులేవోయ్ వెళ్ళూ! ఇంకా రాకపోతే వచ్చేవరకూ వుండి, నీ వెంట తీసుకురా. అతడి నక్క జిత్తులు నా దగ్గర ప్రయోగిస్తాడా! చూస్తాగా! వెళ్ళు...

చక్ర : అలాగేనండీ ! (నిష్క్రమిస్తాడు)

[చిదంబరం చిరాగ్గా పచార్లు చేస్తుంటాడు. లోపల్నుంచి ఆనంద్ వస్తాడు ... తాడ్రి పక్క నుంచే పోతుంటాడు.]

చిద : ఎక్కడికిరా...?

ఆన : డాక్టరు రాసిచ్చిన మాత్రలు తేవడానికి. ఆయన వచ్చి వెళ్ళి యెంతో సేపయ్యిందిగాని, గుమాస్తాచేతనైనా మాత్రలు తెప్పించలేక పోయారు ?

చిద : మందు తెప్పించాను గాని, మాత్రలుమాటే మర్చి పోయాను.

ఆన : ఔనుమరి ! జ్ఞాపక ముండొద్దూ ?

చిద : సరేగాని, మాత్రలుకోసం వెళ్తున్నట్టున్నావు. మీ బావకి వుత్తరం రాసేవు గనుక ... వొద్దుసుమా !

ఆన : మీరు వొద్దని చెప్పాక నే నెందుకు రాస్తాను ? నాకేం అవసరం పట్టిందని ?

చిద : (వుత్సాహంగా) అహ్ ! ఆమాటన్నావు... నాకెంత సంతోషంగా వుందో తెలుసా? అన్నట్టు విజయకి

నువ్వు కాస్త ధైర్యం చెప్పరా! నువ్వు చెప్తే వింటుంది తప్పకండా. దానికేంభయం? ఎప్పటికైనా బావ యిక్కడికే వస్తాడని నచ్చజెప్పు.

ఆన : (వెటకారంగా) నేను చెబితేమాత్రం అది వింటుందా? మీా కున్నపాటి గుండెనిబ్బరం దానికి లేదుగా! దానికి హృదయమంటూ ఒకటుంది. మీాలో వున్నది హృదయంకాదు; పాషాణం. (అంటూ విసురుగా బైటికి పోతాడు)

చిద : (కోపంతో కొడుకు వెళ్ళిపోయిన వేపే చూస్తూ) అబ్బ! ఎంత మిడిసిపాటు! వీడి ఒక్కోమాట, ఒక్కో శూలపుపోటులా గుచ్చుకుంటున్నాయి. వాణ్ణి యెలా దారికి తీసుకురావడమో, వూహ కందడం లేదు. చిన్నతనం కదా అని సర్దుకుపోతుంటే, మరీ హద్దుమీారి మాట్లాడుతున్నాడే.

[చక్రపాణి, శంకరయ్య వస్తారు. శంకరయ్య కాస్త గాభరాగా వున్నట్టగుపిస్తాడు]

చక్ర : ఇదిగోండి బాబూ! త్రోవలోనే కలిశారు శంకరయ్యగారు.

శంక : నమస్కారమండీ!

చిద : (కూచోని) రావోయ్... కూచో.

శంక : (కూర్చుంటూ) తమరు కబురు పంపారనగానే, నా గుండెలో బండరాయి పడిందండీ.

చిద : ఎందుకోయ్ అంత భయం?

శంక: అదేమిటో మరి! మీరు వున్నపాటున రమ్మన్నా రనగానే గుండెల్లో దడ లేచిందంటే నమ్మండి.

చిద: పాపం! చాలా భయస్థుడివి ఆc... చూడు శంక రయ్యా! మొన్నను నేనిచ్చాను కదూ, ఆ డబ్బు యిప్పుడు నాకు అవసర ముందోయ్.

శంక: (తృళ్ళిపడి) డబ్బా? మొన్ననిచ్చిందా? చంపేశారు బాబూ! నేను మొదటే తమతో మనవి చేసు కున్నాను కదండీ, మూణ్ణెళ్ళలో యిస్తానని. మీ రిపుడు వున్నపాటున తెమ్మంటే, యెక్కణ్ణించి తెస్తాను చెప్పండి?

చిద: నీ అవసరం తీర్చాను గాబట్టి, నాకు అవసరమున్న ప్పుడు యిచ్చేయవూ మరి?

శంక: ఇంత అకస్మాత్తుగా యెవరిస్తారండీ! మీరు తప్పించి నేనెవర్నీ అడగనని మీకుమాత్రం తెలీదా యేమిటి?

చిద: నే నొక్కణ్ణే వున్నానేమిటోయ్? నువ్వడిగితే యెవ రివ్వరు? మీ రాఘువయ్యని అడుగు నువ్వడిగితే యివ్వనంటాడా యేమిటి?

శంక: (గతుక్కుమని) నాకూ, రాఘువయ్యగారికి పరిచయం లేదండీ.

చిద: (కటువుగా) పరిచయం లేకుండానే వాళ్ళింటికి వూరికే వెళ్ళావుటయ్యా?

శంక: (చక్రపాణి వేపు అదోలా చూసి నీళ్ళు నములూ) వెళ్ళినమాట నిజమేనండి! ఆయన కబురు పంపితే

వెళ్ళి అడుగులమీద వచ్చేశాను. నమ్మండి, నమ్మక పోండి...

చిద : నీకు కబురు పంపే అవసరం ఆయన కేమొచ్చిం దయ్యా ?

శంక : వాళ్లమ్మాయికి యీమధ్యనే పెళ్ళంట కదండీ! ఏవో సామానులు కావాలట. అందుకే పిలిపించాడు.

చిద : ఓహో! పరిచయం పుష్పిస్తున్న దన్నమాట! మరింకేం నా కవన్నీ అనవసరం. తక్షణం నువ్వు నా కాడబ్బు తెచ్చి యిచ్చేయాలి. ఎలా తెస్తావో, యెక్కణ్ణించి తెస్తావో నాకు తెలీదు.

శంక : (ప్రాధేయంగా) మీరింత నిర్దాక్షిణ్యంగా శలవిస్తే మాలాంటివాళ్ళం బ్రతగ్గలమా?

చిద : నీకేమోయ్! రాఘవయ్య లాంటి వాళ్లు తలచు కుంటే, నీకు కొదవేమిటి?

శంక : నిజం చెప్పినా మీరు నమ్మడంలేదండీ! ఏం చేసేది? ఇదంతా చక్రపాణి ముట్టించాడులా వుంది.

చక్ర : అబ్బే? నేనేం చెప్పలేదండీ!

చిద : చెబితే చెప్పాడు, వున్నమాట చెబితే, నీకు ఉడుకు మోత్తనం యెందుకు? రాఘవయ్యని అడుగు. డబ్బి స్తాడు.

శంక : అత నివ్వడండీ?

చిద : అదంతా నాకు తెలీదు. వారం రోజులు గడువిస్తున్నాను. నాడబ్బు నాకు తెచ్చి యిచ్చేయవల్సిందే! లేకపోతే మంచిమాట కాదు.

శంక : (దిగులుగా) మంచి చిక్కే వచ్చిపడిందండీ! కాస్త నిదానంగా ఆలోచించండి చిదంబరంగారూ !

చిద : (ఖచ్చితంగా) ఇంక ఆలోచించేదేమీ లేదు. వెళ్ళిక.

శంక : సరే! (మొహం వేలేసుకొని నిష్క్రమిస్తాడు. క్షణం పోయాక ఆనంద్ బైటనుండి వస్తాడు)

ఆనం : శంకరయ్య అలా మొహం వేలాడేసుకు పోతున్నాడేం నాన్నా!

చిద : (అసహనంతో) నన్ను అడగడమెందుకూ? అతణ్నే అడిగి అతని తరఫునకూడా వకాల్తా పుచ్చుకుని వాదించు. నీ ఉద్యోగం అదేగా?

ఆనం : (చిరాగ్గా) అబ్బబ్బ! ఎప్పుడూ ఎవరితోనో ఒకరితో ఏదో ఒక తగవు వుంటుండాలి. లేకపోతే కాలం గడవదు ...(లోపలికి పోతాడు)

చిద : ఛీ! ఛీ! నా కడుపున చెడబుట్టావురా! (విసుగ్గా పచారు చేసి) ఎప్పుడూ నన్ను విమర్శించడమేగాని, నన్ను వెనకేసు కొచ్చిన రోజులేదు. ...ఇకరాదు కూడాను. ...ఇదంతా నా ఖర్మ... (సోఫాలో కూర్చుంటుండగా)

—తెర—

# కరిగిన శిల

## మూడవ రంగము

[రంగస్థలంలో మార్పువుంటదు. తెర లేచేసరికి ఆనంద్ చిరాగ్గా కుర్చీలో కూచొని వుంటాడు. అతని మొహంలో బాధ ప్రస్ఫుట మౌతుంది. చిదంబరం నిర్విరామంగా పచారు చేస్తుంటాడు. అతని హృదయంలో తుఫాను రేగిందని, ఆ వాలకమే చెప్తుంది.]

చిద : (పచారు చేస్తున్నవాడంతా ఆగి) అందరూ నన్ను నిందించేవాళ్ళేనా! నన్ను విమర్శించేవాళ్ళే! అంతేగాని భార్యనువిడిచివెళ్ళాడుగదా, ఆమెఎలావుందో, చచ్చిందో, బ్రతికివుందో నని ఒక్కసారైనా తొంగి చూశారా మీ బావ? భార్యంటే మమకారం వుంటేకదూ?

ఆన : (లేచి నుంచుని) మమకారం వుండబట్టేకదూ, తనతో పాటు తీసుకుపోతానన్నాడు? మీరు పంతంబట్టి పంపనంటే ఏంచేస్తాడు? బలవంతంగా తీసుకుపోతాడా? విజయకి వంట్లో బాగులేదని వుత్తరం రాస్తానంటే, ససేమిరా వొద్దని నన్ను వారించారు. ఇప్పుడేమో, ప్రమాదపరిస్థితి ఏర్పడేసరికి, టెలిగ్రామ్ యిమ్మన్నారు మీరే! ఇంత ఆలస్యంగా తెలియజేసినందుకు బావ ఏమనుకుంటాడో, కాస్తయినాఆలోచించారా?

చిద : ఏమనుకుంటాడ్రా? ఇందులో మసంచేసిన జాప్యం

యేమీ లేదే! అకస్మాత్తుగా వచ్చిపడిన జబ్బుకి ఎవరేం చేస్తారు?

ఆన : (అసహ్యంగా) అడుగడుక్కీ అబద్ధమేనా నాన్నా? ఇంట్లోవాళ్ళమీదకూడా మీ రాజకీయ తంత్రాన్ని ప్రయోగిస్తే యెలా చెప్పండి? సరే నాకేం? (ద్వారంవేపుచూసి) డాక్టరు యింకా రాలేదే! చక్రపాణి ఎక్కడచచ్చాడో యేమిటో!

చిద : వస్తూవుంటాడు లేవోయ్. తొందరపడితే యెలా?

ఆన : (అగోలా నవ్వి) మీ గుండెధైర్యానికి మెచ్చుకోవల్సిందే నాన్నా!

చిద : ఏనాడు నువ్వావమాట అనలేదులే!

ఆన : ఒకపక్క కన్నకూతురు చావు బ్రతుకుల్లోవుంటే, మీకు చీమకుట్టినట్టయినా లేదు.

చిద : లేకపోవడమేమిట్రా? డాక్టర్ని అర్జంటుగా తీసుకు రమ్మని చక్రపాణిని పంపింది నేనేగా! (బైట జోడు చప్పుడు విన్పిస్తుంది.) అదిగో డాక్టరే వస్తున్నట్టుంది.

[చిదంబరం, ఆనంద్, వీధిద్వారం వేపే దృష్టి నిలుపుతారు. రామేశం, ఆదరా బాదరాగా వస్తాడు. అతనిచేతిలో ఓ చిన్న బేగ్ వుంటుంది. అతని మొహం వాడిపోయి వుంటుంది.]

ఆన : బావా!

రామే: ఆనంద్...ఎలావుంది విజయకి?

ఆన : (జవాబివ్వడు)

రామే: (చలించిపోయి) జవాబివ్వవేం ఆనంద్? విజయకి యెలావుంది? ప్రమాదమేం లేదుకదా?

ఆన : (నిగ్రహించుకొని) ప్రమాదమేమీ లేదులే బావా... లోపలికి పద.

రామే: బాగులేనట్టు ముందుగా ఓ ఉత్తరమైనా రాయలేక పోయారా?

చిద : (కలిగించుకుని) అకస్మాత్తుగా వచ్చిపడిన జబ్బుకి, యెవరేం చేస్తారోయ్? ముందుగా మాకు తెలిస్తేగా, తెలియజెయ్యడానికి!

(ఆనంద్ తండ్రివేపు అయిష్టంగాచూస్తూ, రామేశాన్ని తీసుకుని లోపలకు పోతాడు)

చిద : (కోపంగా) పిట్ట కొంచెమైనా, కూత ఘనంగా వుందే! ఎంత పౌరుషం: వస్తూనే బావమర్దిని అడిగాడు గాని, చెట్టులాంటి మనిషిని ప్రత్యక్షంగా వున్నా, నన్నడగలేదే! హుం!

చక్ర : (బైటనుండి వస్తూ) బాబూ! డాక్టరుగారు ఇంటి దగ్గర లేరండి.

చిద : ఆస్పత్రిలో చూళ్ళేక పోయావూ?

చక్ర : అక్కడా లేరండీ! ఎవరో పిలిస్తే, వెళ్ళారుట...

చిద : ఆయన వచ్చేవరకూ వుండి, తీసుకురాలేకపోయా వటయ్యా! ప్రతీదీ చిన్న పిల్లాడికి చెప్పినట్టు చెప్పుండాలి. తల నెరుస్తున్న కొద్దీ; తెలివి తగ్గుతోంది.

చక్ర : (భయంగా) పొరపాటేను బాబూ! ఇప్పుడే మళ్ళా వెళ్తాను. (నిష్క్రమిస్తాడు)

[లోపల్నుంచి రామేశం, ఆనంద్ వస్తారు. రామే
శం మొహం కళావిహీనంగా వుంటుంది. వచ్చి
కుర్చీలో దీనంగా కూచుంటాడు. ఆనంద్ అతని వేపే
దృష్టి వుంచుతూ మరో కుర్చీలో కూలబడతాడు.]

రామే: మనిషి చిక్కి, శల్యమైపోతే, అకస్మాత్తుగా వచ్చి
పడిన జబ్బంటూ రేవిటి? నాకు నమ్మకం చాలదు.
మాట్లాడవేం ఆనంద్? జ్వరం, ఏరోజవు తేవచ్చిందో
ఆరోజే ఓ కార్డుముక్క రాసి పడేస్తే, నేను రాక
పోదునా?

ఆన : (మొహం దించుకుని) రాయాలనే అనుకున్నాను.
... కాని... (తండ్రివేపు చూస్తాడు.)

రామే: (అర్థం చేసుకుని) మీనాన్నగారు వద్దన్నారు కదూ!
(లేచి చిదంబరానికి దగ్గరగా పోయి) నాకు తెలీనివ్వొ
ద్దని సలహా యిచ్చింది మీరేనా? ఔను మీరే!
నాకు తెలుసు. మీకు హృదయం లేదు. మీ గుండె
బండరాయి. అందులో రక్తమాంసాలు లేవు. కని
కరం యేకోశానా లేదు.

చిద : చాలించవోయ్ యిక! నాగుండెల్ని విమర్శించే
ముందు నీ హృదయపు నిజస్వరూపం తెలుసుకో!
భార్యను విడచిపెట్టి వెళ్లావు. ఆమె నీకోసం ఎంతగా
పరితపిస్తుందో, యెలా మనోవ్యథతో కృశించి
పోతుందో, ఆలోచించి ఒకసారైనా వచ్చి
చూశావూ? నీ హృదయంలో జాలి, కనికరం,

వున్నాయా? నీ తప్పు నువ్వు తెలుసుకోకుండా నన్ను విమర్శిస్తా వేమిటి?

రామే: అప్పుడే మీ ధోరణి మార్చేశా రేమిటి? మీ స్వార్థం కోసం, మీ ప్రయోజనం కోసం, మీ నోటిని యెలా కావాలంటే, అలా తిప్పుకుంటారు. విజయను ససేమిరా పంపనని పట్టుబట్టి కూర్చున్నది మీరు కాదా? మరి, నేనే ఆమెను విడిచి వెళ్లా నంటా రేమిటి?

చిద : ఔను! ఆ నిష్ఠూరమంతా నామీదే వెయ్యి. నిన్ను అందరూ వెనకేసుకొస్తారని గామోసు, నీ ధైర్యం? కాని నేను యెవర్నీ లెఖ్ఖ చెయ్యను.

రామే: అందుకేకదూ, పరిస్థితి యింతవరకు వచ్చింది? భార్యాభర్తల అనురాగానికి అగాధంలా అడ్డువచ్చి, మమ్మల్ని వేరుచేసి, మీరు బావుకున్న దేమిటి? ఒకరికోసం, ఒకరు పరితపించి; నిస్సారమైన జీవితాన్ని గడుపుతున్న మా బాధ మీరెందు కర్థం చేసుకోరు? మీకు, మీచుట్టూ జరుగుతున్న విషయాల ప్రమేయమే లేదు. మీధోరణి మీది. మీ పట్టుదల మీది. ఎవరు అంతమైనా, యెవరు నాశనమైనా, మీకు అనవసరం! మీరు మాత్రం స్వేచ్ఛగా అధారిటీలు చలాయిస్తూ నియంతలా అందర్నీ యేడిపిస్తూ, కాలం గడిపితే చాలు. అదే మీకు ఆనందం. అదే మీకు స్వర్గం!

చిద : (కోపంతో పళ్లు కొరుకొతూ) రామేశం! హద్దులు అతిక్రమిస్తున్నావు.

రామే: బెదిరిస్తున్నారా? బెదిరించి నన్నేమీ చెయ్యలేరు. నేను సర్వస్వతంత్రుణ్ణి. మీ దయాదాక్షిణ్యాలమీద మీ నీడలో బ్రతుకుతున్నవాణ్ణి కాదు. మీదగ్గర నాకు భయమెందుకు? ఇన్నాళ్ళూ మీ గౌరవం, మీ ప్రతిష్ఠ, నలుగురి మధ్య పడకుండా కాపాడాను. మీరది గ్రహించలేదు. మీకు కనువిప్పు కలుగలేదు. స్వంత కూతురి సుఖాన్ని సహితం మొదలంటా నరికారు. ఇంతకంటే రాక్షసత్వం యింకేముంటుంది? ఇన్నాళ్ళూ సహించాను. ఇంకసహించలేను... కాదు... నాలో సహనం నశించిపోయింది. మీ క్రౌర్యం, మీ పట్టుదల, మీ స్వార్థం, లోకానికి చాటవల్సిన సమయం ఆసన్నమయ్యింది.

ఆన : బావా! ఎందుకలా వుద్రిక్తుడ వౌతావు?

రామే: నీకు మాత్రం తెలీనిదేముంది ఆనంద్! ఇంతవరకూ స్వార్థమనే తెరతో కప్పబడివున్న మీ నాన్న కళ్ళు తెరవాలనే నా వుద్దేశ్యం.

చిద : (ఉద్రేకంతో) మొన్న మొన్నటి కుర్రాడివి. నీ వయస్సు, నావయస్సులో నాలుగోవంతు వుండదు. నువ్వు నాకళ్లు తెరిచేదేవిటోయ్?

రామే: ఏవిటో, మీఅంతట మీరే గ్రహిస్తారు. ఒక్కసారి ఆత్మవిమర్శ చేసుకోండి. మీ పట్టుదల, మీ కాఠిన్యత, యెంతమందిని యెన్నివిధాల యిను

యాతనకు గురిచేశాయో, గతాన్ని నెమరువేసు కుంటే మీకే తెలుస్తుంది. మీరు చేస్తున్న పొర పాట్లు, మీరు వేస్తున్న తప్పటడుగులు, మీకు తెలిసి కూడా అదో విధమైన ఆనందంగా భావిస్తున్నారు! ప్రస్తుతం విజయ విషయమే ఉదాహరణంగా తీసు కోండి. (క్షణం ఆగి బాధగా) ఖర్మం చాలక ఆమెకి నూరేళ్లూ నిండితే అందుకు బాధ్యులెవరు? మీరేనా? కన్న కూతుర్ని కసాయివాడికంటే క్రూరంగా చిత్ర వధ చేసిన ఖ్యాతి ఎవరికి దక్కుతుంది? మీకేనా? కాదు... కాదు... నేను పొరపడ్డాను. నిజం ప్రజలకు తెలీకుగా! కాని... మీ మనసుకి తెలీదా?

చిద : (గతుక్కుమని) రామేశం? ఏమిటీ అఘాయిత్యపు మాటలు?

రామే: (అదోలా నవ్వి) 'అఘాయిత్యం' అన్న పదం ఒకటుందని మీకు తెలిసినందుకు నేను చాలా సంతో షిస్తున్నాను మామగారూ! మిమ్మల్ని 'మామ గారూ' అని సంబోధించడానికూడా నాకు సిగ్గు వేస్తుంది.

చిద : చాల్లేవోయ్! ఎవరైనా వింటే, నవ్విపోతారు...

రామే: నవ్వుతారా? నవ్వనీయండి నవ్వితే మీకేం? ఒక రితో మీకు పనేమిటి? ఎవరికీ భయపడేటంతటి దుర్బల హృదయం కాదే మీది! ఇప్పుడు నిజంగా నాకు యేడుపొస్తోంది. కాని... కాని... ఆ ఏడుపుతో పాటు, మీమీద అంతులేని కోపం ముంచు

కొస్తోంది. దాంతో, యేడ్చేశక్తి యింకిపోయింది. హృదయంలో కోపాగ్ని దహిస్తోంది. శరీరాన్నంతా మండిస్తోంది. (బాధగా) నా విజయ కాలం కలిసి రాక యీ లోకం విడిచిపోతే, మీరొక్క కన్నీటి బొట్టయినా రాలుస్తారా? మీ పాషాణ హృదయం చలిస్తుందా? చలించదు. కాని... కాని... నా బాధని యెవరు తీరుస్తారు? నాహృదయ వేదన ఎవరు చల్లారుస్తారు? (క్షణం మౌనంగా వూరుకొని బాధతో) విజయా, నిన్ను క్రూరాతి క్రూరంగా, బలవంతంగా చంపేస్తున్నాం విజయా! ఇందుకు నన్ను నిందించకు.... నేను బాధ్యుణ్ణి కాదు.... మీ నాన్నే బాధ్యుడు. మీ నాన్నే బాధ్యుడు. (మెల్లగా కుర్చీలో కూలబడతాడు.)

[సరిగ్గా అప్పుడే డాక్టరు వస్తాడు ఆత్రంగా. చక్రపాణి అతని వెంట వుంటాడు.]

డాక్ట : (ఆత్రతగా) ఏమిటండీ, అందరు అలా దిగులుగా వున్నారేం, ఎలా వుందామెకి?

చిద : రండి, డాక్టరుగారూ! లోపలికి రండి. (లోపలికి పోతాడు. డాక్టరు అతనివెంట పోతాడు. చక్రపాణి ఆఫీసు గదిలోకి జారుతాడు )

రామే: (రుద్ధకంఠంతో) ఆనంద్! విజయ బ్రతుకుతుందంటావా?

ఆన : ఎందుకలా అధైర్యపడతావు బావా? ప్రమాదస్థితి

యేమీ వుండకపోవచ్చు. నువ్వే యిలా దిగజారిపోతే యెలా చెప్పు.

రామే: జీవితంలో, నేనెప్పుడూ యిల్లాంటి ఆవేదన అనుభ వించలేదు ఆనంద్!

ఆన : నిజమే మరి! కాని, వచ్చిన కష్టాల్ని యెదుర్కోకుండా తప్పించుకు పారిపోగలమా?

రామే: అదే మానవుడికి చేతకానిది. ఎలాగైనా విజయ బ్రతికి బైటపడ్డం నాకు కావాలి. అదొక్కటే నేను కోరేది. నాకింక యెవ్వరితోనూ అవసరముండదు. విజయను ఒక్క క్షణం యిక్కడుంచను.

[డాక్టరు, చిదంబరం, గదిలోనుండి తిరిగివస్తారు రామేశం ఒక్క అంగలో డాక్టరు దగ్గరికి వెళ్తాడు.]

రామే: (ప్రాధేయంగా) ఎలావుంది డాక్టర్? అపాయం యేమీ లేదంటారా? చెప్పండి డాక్టర్! లేదని చెప్పండి డాక్టర్.

డాక్ట : అంత గాభరాపడితే యెలాగండీ.

రామే: మీరు నా హృదయావేదన అర్థం చేసుకోవడం లేదు డాక్టర్.

డాక్ట : అర్థం చేసుకున్నానండీ! మీ ఆత్రుతకూడా అసహజం కాదు. కాని, దేనికైనా కాస్త సహనం, నిదానం అవసరం. ఆమెకి ప్రస్తుతం ప్రాణాపాయం వుండకూడదు, కాని...

రామే: (ఆత్రుతగా) కాని... యేమిటి డాక్టర్? డబ్బు ఖర్చవు

తుందంటారా? ఎంతయినా ఫరవాలేదు. ఆమెని బ్రతికించండి డాక్టర్!

డాక్ట : అబ్బ! మీతో గొప్ప చిక్కు వచ్చిందండీ. అసలు, ఆవిడకి ఫలానా రోగమని తేల్చి చెప్పలేం. ఎన్ని సార్లు పరీక్ష చేసినా, ఒక నిర్ణయానికి రాలేకపోతున్నాను. ఆమె అలా కృశించిపోతుండటాన్ని బట్టి చూస్తే, బహుశా, అంతులేని మనోవ్యధకు లోనై వుండాలనిపిస్తోంది.

చిద : అబ్బెబ్బే! మనోవ్యధేమీ లేదండీ డాక్టరుగారూ! ఆ విషయం యింతకుముందే మీతో చెప్పానుగా!

రామే: (అందుకుని) అబద్ధం డాక్టర్! అంతా అబద్ధం. మనోవ్యధే ఆమె నిలా కృశింపజేస్తుండాలి.

డాక్ట ; మరి, మీ మావంగారు మనోవ్యధ లేదంటున్నారే?

రామే: అంటారు డాక్టర్! అలా అనాలిమరి! ఒక తప్పు సమర్థించుకుందుకు వంద తప్పులు చెయ్యాలి. వెయ్యి అబద్ధాలాడాలి.

డాక్ట : ఇంతకీ, మనోవ్యధకి కారణం?

రామే: చెప్తాను డాక్టర్... చెప్తాను. ఇన్నాళ్ళూ యెవరితోనూ యీ విషయాన్ని చెప్పుకోలేదు. గుండెల్లో రహస్యంగా దాచుకున్నాను. ఎవరితోనూ చెప్పుకోలేక కుమిలిపోయాను. సవ్యంగా, మంచిగా, వ్యవహారాన్ని పరిష్కారం చేసుకోవాలనుకున్నాను. కాని, నా మంచితనమే నన్ను ఓడించింది. నేను యిక్కడికి యాభైమైళ్ళ దూరంలో వుంటున్నాను.

మామామావఁగారు నన్ను యిక్కడికి ట్రాన్స్ఫర్ చేయించుకుని వచ్చేయ మన్నారు. కాని, నా ఆర్థిక స్థితి, కుటుంబ పరిస్థితి నన్ను ప్రోత్సహించలేదు. చేసేది లేక రాలేనన్నాను. ఇదే నేను చేసిన తప్పు డాక్టర్! ఈ తప్పుకి శిక్షేవిఁటో తెలుసా డాక్టర్! మీకు తెలీదు. కూతుర్ని చూడాలంటూ రప్పించుకుని మరి పంపనన్నారు. ఇక్కడికి నేను బదిలీమీద వచ్చాకనే పంపుతారట...

చిద : (అందుకుని) అదంతా కల్పన డాక్టరుగారూ!

రామే: కల్పితం కాదు డాక్టర్! అక్షరాలా నిజం. మా మావఁగారు స్వార్థంతో యిలా ప్రవర్తించారు. చూడండి డాక్టర్. యెంత అన్యాయంగా వుందో! ఏ న్యాయశాస్త్రం యీ శిక్షను ఒప్పుకుంటుంది? ఆమె నాదగ్గరికి వచ్చేస్తానని మొరపెట్టింది. కాని మావఁగారు ఒప్పుకోలేదు. ప్రాధేయపడింది. ఆయన మనసు కరగలేదు. మా యిరువురి అనురాగ లత త్రుంచివేశారు. ఇరువురి మధ్య పెద్ద అగాధం త్రవ్వారు. దాంతో ఆమె మనసు వికలమయ్యింది. మనోవ్యథతో కృంగిపోయి కృశించి పోయింది. ఇదీ అసలు రహస్యం డాక్టర్ !ఆమె చనిపోతే, చట్ట రీత్యా యెవరు నిందితులవుతారు డాక్టర్?

చిద : (ఉద్రేకంతో పళ్ళు పటపట కొరుకుతూ) రామేశం! (గట్టిగా అరుస్తాడు. ఆ అరుపుకి యిల్లంతా ప్రతిధ్వనిస్తుంది. చిదంబరం గుండెల్లో నొప్పివస్తుంది.

మొహం స్వేదంతో నిండిపోతుంది. గుండెను పట్టు కొని సోఫాలో కూలబడతాడు. డాక్టర్ ఆతృతగా అతని దగ్గరికిపోయి లాల్చీగుండీలు విప్పుతాడు. రుమాలుతో విసురుతాడు )

డాక్ట : చిదంబరంగారూ! చిదంబరంగారూ!

[చిదంబరం కళ్ళు తెరుస్తాడు. ఆయాసంతో నిట్టూరుస్తాడు.]

డాక్ట : ఏమయ్యిందండీ?

చిద : (నీరసంగా) ఏం లేదండీ. ఎప్పుడూవున్న జబ్బేగా! గుండెల్లో నొప్పి వచ్చిందిలెండి...

డాక్ట : ఇప్పుడెలావుంది?

చిద : కాస్త తగ్గింది డాక్టరుగారూ! నిజంగా నేను క్రూరుణ్ణే, నావంటి పాషాణ హృదయుడు మరి వుండడు, పట్టుదలనే తెర నా కళ్ళను కప్పింది. అది ఇప్పుడు తొలగిపోయింది. ఇంతమందికి విరోధినై, అందరి శాపనార్థాలకూ గురియై, నేనేం సుఖపడు తున్నాను? కొడుక్కీ, కూతురికీ, అల్లుడికీ, యింకా కొందరికీ, విరోధినయ్యాను. అందరూ నన్ను అస హ్యించుకొన్నవాళ్ళేగాని, మెచ్చుకునేవాళ్లూ సాద రంగా మాట్లాడేవాళ్లూ, ఒక్కరూ లేరు! ఎలా వుంటారు? నేను చేతులారా సృష్టించుకున్న వాతా వరణం అది. ఇన్నిసార్లు గుండెలో నొప్పివచ్చింది గాని, ఎప్పుడో ఓసారి 'హరీ' మన్పిస్తే బావుండిపోను. (కుమిలిపోతాడు)

డాక్ట : అల్లాంటి మాటలనకండి చిదంబరంగారూ! మీరు కోరుకున్నంతమాత్రాన చావు వస్తుందనుకున్నారా? దానికి సమయం రావాలి. మీరు ఆలోచనలు మానేసి, వుద్రిక్తత తగ్గించుకుంటే, ఆరోగ్యం కుదుటపడ్డానికి అవకాశం వుంది. ఎంత ప్రశాంతంగా మీమనస్సుంటే, అంత మంచిది.

చిద : నాకింక ప్రశాంతత యెలా వస్తుందిలెండి? (మెల్లగా లేచి రామేశం దగ్గరగా వెళ్ళాడు) రామేశం! వుద్రేకంలో ఏదో అనేశాను. మరేమీ మనసులో వుంచుకోకు, కోపమన్నది మనుషులకుండకపోతే, మానులకుంటుందా! నాసంగతి నీకు తెలీందికాదు. నాసహజప్రవృత్తిఅది. పట్టుదలతో వచ్చిన ఉద్వేగాన్ని ఆపుకోలేను. కటువుగా ప్రవర్తిస్తాను. అది సాధించానని, గెలుపొందానని గర్వమూ, సంతృప్తీ ఒకప్రక్క వున్నా, యెదుటివ్యక్తుల బాధను అప్పుడప్పుడు తల్చుకుంటాను. కాని, నామనసు కరుగదు. ఏం చెయ్యను? అంతరాళంలో పట్టుదల ప్రబలంగావుంటే ఎలా కరుగుతుంది?...(క్షణంమౌనం) నీకూ, విజయకీ చాలా అన్యాయం చేశాను. మీయిద్దరి యెడబాటుకి కారకుడనై, నీ పరితాపానికీ, విజయ ప్రాణాపాయానికీ తావిచ్చాను. నిజంగా నాప్రవర్తన తల్చుకుంటే, నామీద నాకే అసహ్యమేస్తుంది. నన్ను క్షమించు రామేశం...!

రామే: (మొహం దించుకుని) మావయ్యగారూ!

చిద : ఫరవాలేదులే నాయనా! క్షమించమని చిన్నవాళ్ళని అర్థించడంలో తప్పేమీ లేదు. విజయ దగ్గిరికి వెళ్ళి, కాస్త ధైర్యం చెప్పు.

డాక్ట : ఔనండీ! వెళ్ళి మీ వాళ్ళకి కాస్త ధైర్యం చెప్పండి. అనురాగంతో, ఆత్మీయత ఉట్టిపడేట్టు మాట్లాడండి! వంట్లో స్వస్థత చేకూరాక మీతో తీసుకుపోతానని వాగ్దానం చెయ్యండి! మీ మావంగారు మారిపోయారని చెప్పండి! మనసుకి నచ్చేమాటలు సగం బలాన్నిస్తాయి. వెళ్ళండి...!

రామే: (తృప్తిగా) థాంక్స్ డాక్టర్! (లోపలికి పోతాడు)

డాక్ట : వస్తానండీ చిదంబరంగారూ! మీలో యిప్పటికైనా మార్పు రావడం చాల సంతోషం! ఎందుకైనా మంచిది ఎవర్నయినా పంపితే మందిస్తాను.

చిద : అలాగేనండీ! నా గురించిమాత్రం మీరు తప్పుగా అభిప్రాయపడకండి.

డాక్ట : అబ్బే! ఇదో పెద్ద విశేషం కాదులెండి. వస్తా. (నిష్క్రమిస్తాడు.)

ఆన : నేను డాక్టరుగారితో వెళ్ళి మందు తెస్తాను నాన్నా!

చిద : అలాగే వెళ్ళిరా!

[ఆనంద్ వెళ్ళిపోతాడు]

చిద : (స్వగతం...) నా కఠినత్వం, నా స్వార్థం, నా స్వాభిమానం... యెన్ని అనర్థాలకు ఆస్కారమయ్యింది! కన్నకొడుకు అసహ్యించుకుంటున్నాడు. కూతురు ఛీదరించుకుంటూ, మనోవ్యథతో మంచ

మెక్కింది! మనసులో మథనపడుతూ, యెన్ని శాపనార్థాలు పెట్టిందో! అల్లుడు కోపోద్రేకంతో కన్నూమిన్నూ గానక, క్రూరాతి క్రూరంగా విమర్శించి చిత్రవధ కంటె మిన్నగా హింసించాడు! నాకున్న గౌరవం, ప్రతిష్ఠ, డాక్టరు సమక్షంలో భంగపడింది! అంతకంటె అవమానం యింకేముంది! ఛీ! ఎందుకీ జన్మ! సర్వేశ్వరా! ఎందుకు నాకీ బుద్ధులు పుట్టించావు? ఎందుకిలా విమర్శలకు గురిచేశావు? నాకిది పరీక్షా? ఈవిధంగా నేను పశ్చాత్తాపంతో కుమిలి పోవడానికేనా?

[బైటనుంచి చలం వస్తాడు. అతన్ని చూశాక చిదంబరం కాస్తంత కలవరపడ్డాడు]

చలం: నమస్కారమండీ!

చిద : నువ్వా! రావోయ్...నీకింకా కబురుపెట్టాలనుకుంటున్నాను కూచో!

చలం: పరవాలేదు లెండీ.

చిద : అలాగంటే కాదు...ఆ కుర్చీలో కూచో!

చలం: (చిదంబరంలో కలిగిన మార్పుకి విస్తుపోయి కూచుని) మీరేం ఆలోచించారండీ!

చిద : ఏ విషయంలో?

చలం: అప్పుడే మర్చిపోయారా! నాకు న్యాయంగా రావల్సిన డబ్బు విషయంలో. మీరింకా మీ మొండిపట్టు విడువకుండావుంటే కోర్టుగోడల చుట్టూ ప్రదక్షిణాం చేసే అవస్థ యేర్పడుతుంది.

చిద : ఆవేశం వొద్దబ్బాయ్. నిజంగా మీకు నేను అన్యాయమే చేశాను. తప్పుడు లెఖ్ఖలు చూపించి, నిన్ను నమ్మించి, మీకు రావలసిన భాగంలో అధికంగా కాజేశాను. పరలోకంలో వున్న మీ నాన్నకి తీరని అపకారం చేసి, మీ ఇరువురి అనుబంధానికీ కళంకం తెచ్చాను. ఏం చెయ్యను? ఆక్షణం అలాంటిది. క్షణిక దౌర్బల్యానికి దాసుడనై ధనవ్యామోహాన్ని దూరంగా వుంచే మనోనిగ్రహం లేక, అప్పుడలా గడ్డికరిచాను. మీ కుటుంబం నాశనానికి కారకుణ్ణయ్యాను. నీచేత ఇన్ని మాటలూ తిన్నాను. అందుకు నేనిప్పుడు చింతిస్తున్నాను. పశ్చాత్తాపంతో నా హృదయమాలిన్యాన్ని తుడిచేసుకున్నాను. నా అంతరాళంలో జరుగుతున్న సంఘర్షణ, సంక్షోభం నీకు తెలీదు. నేను చెప్పలేను. నా మనస్సు మేలుకొంది. నా కళ్ళు చీకటి తెరల్ని విప్పుకున్నాయి. నా మెదడు మంచి ఆలోచనలకు తావిచ్చింది, అబ్బాయ్... నీకు రావల్సింది నయా పైసాలతో సహా యిచ్చేస్తాను.

చలం: (నమ్మలేక) ఇంకా, నన్ను నమ్మించి మోసం చెయ్యాలనుకుంటున్నారా చిదంబరంగారూ! లేక, న్యాయస్థానానికి వెరచి మారిపోయారా?

చిద : (అదోలా నవ్వి) నువ్వు వూహించిన రెండు కారణాలూ కావు. నిన్ను మోసం చెయ్యాలన్న తలంపే నాకు లేదు. న్యాయస్థానానికి వెరవనూ లేదు. న్యాయ

మంటేనా కెప్పుడూ భయంలేదు. నాకుడబ్బుంది. అన్యాయాన్ని, న్యాయంగా మార్చేసే వకీళ్ళున్నారు. అందుకు భయపడి మారిపోయానని మాత్రం అనుకోకు. నాలో అకస్మాత్తుగా అనిర్వచనీయమైన, అవ్యక్తమైన మార్పువచ్చేసింది. ఇప్పటికైనా నా మాటలు నమ్ముతావా?

చలం: (అదోలా చూసి) మీరంత బలీయంగా నచ్చచెప్తూ వుంటే, నమ్మకుండా వుండటం యెలా చెప్పండీ? నమ్ముతున్నాను మరి, యెప్పుడు రమ్మంటారు?

చిద : (నెమ్మదిగా) నీ ఇష్టమొచ్చినపుడు రా అబ్బాయ్... ఈ చిదంబరం యింటి ద్వారాలు నీకోసం సదా తెర్చుకుని వుంటాయి. మీకు నేను చేసిన అపకారానికి నిష్కృతి యేమిటో, ఆ భగవంతుడే నిర్ణయించాలి. అంతా అతని లీల...

చలం: (వుత్సాహంగా) మీలో మార్పురావడం నిజంగా మా అదృష్టమేనండి. మీ మాటమీద నమ్మకముంచి వెళుతున్నా (లేస్తాడు)

చిద : నీకింకా అపనమ్మకం పోద్దబ్బాయ్...(అదోలానవ్వి) ఔను. నువ్వింకా నన్ను నమ్మలేకపోతున్నావు. దొంగ, దొంగతనంమాని దొరలా బ్రతుకుతున్నా, అతన్ని యెవరూ నమ్మడానికి సాహసించరు. అది సహజం. నిజం చెపుతున్నా చలం...నన్ను నమ్ము. (అతని కళ్ళు నీళ్ళపర్యంతమౌతాయి).

చలం: (మెల్లగా) వస్తానండీ! (నిష్క్రమిస్తాడు)

చిద : (కాసేపు మౌనంగావుండి పరధ్యానంగా నిట్టూరుస్తాడు) చిదంబరం, నీకింకా మనశ్శాంతి వుండదు. నువ్వు చేసిన అన్యాయాలకు నిష్కృతిలేదు. ఇప్పటికి నీలో జ్ఞానోదయం కలిగినా, వెనుకటి పాపఫలం నిన్ను తరుముతూ వుంటుంది. హృదయాన్ని రగిల్చేస్తుంది అదే నీకు సరైన ప్రాయశ్చిత్తం. చిదంబరం... అదే ప్రాయశ్చిత్తం. నీ పాషాణ హృదయానికి అదే తగిన ప్రాయశ్చిత్తం. (నిర్జీవంగా కుర్చీలో కూలబడతాడు అతని మొహంలో కాంతివుండదు.)

[శంకరయ్య వస్తాడు]

శంక : (వస్తూ) నమస్కారమండీ!

చిద : రావోయ్ శంకరయ్యా! కూచో.

శంక : (కూచుని) అలావున్నా రేమండి?

చిద : ఏవీలేదు, వూరికనే. ఏవిటి యిలా వచ్చావు?

శంక : (బాధగా నిట్టూర్చి) ఏం చెయ్యనండీ? డబ్బుతక్షణం తిరిగి యిచ్చేయమని మీరు నిర్బంధించారుగా! ఏం చేస్తాను. నాలాంటి సామాన్యుడు, తీసుకున్న ఘడియల్లో ఆర్థికసహాయం ఎక్కణ్ణించి పొందుతాడు చెప్పండి? నాదగ్గరే డబ్బుంటే, మిమ్మల్ని అర్థించి, ప్రాధేయపడి అప్పు తీసుకెళ్ళవల్సిన అవసరం నాకేముంది? మిమ్మల్ని మోసం చెయ్యడం, మీతో విరోధపడ్డం, నా అంతరాత్మ కిష్టంలేదు. మా ఆవిడ నగలు తాకట్టుపెట్టి డబ్బుతెచ్చాను. ఇదిగోండి. నేను

తమకి రాసిచ్చిన నోటు యిచ్చేయండి. (జేబునుండి డబ్బుతీసి యిస్తాడు)

చిద : (డబ్బు పుచ్చుకోకుండా, శంకరయ్య చేతులు పట్టుకొని) నేను చాలా తొందరపడ్డాను శంకరయ్యా! రాఘవయ్యతో నెయ్యం జరుపుతున్నావన్న అసూయతో నీ పట్ల ఇలా ప్రవర్తించాను. నానిర్దాక్షిణ్యత, నాకాఠిన్యత, నిన్ను నొప్పించి యుంటుంది నువ్వు మరేమీ అనుకోకు. అసూయ, ఆవేశం. మనిషిని ఎంతగా దిగజారుస్తాయో, యిప్పుడునాకు బోధ పడింది. ఈ డబ్బు తీసికెళ్ళి నగలు విడిపించుకో. వడ్డీ నేనిచ్చుకుంటాన్లే. నీదగ్గరున్నప్పుడే, నాడబ్బు తెచ్చియివ్వు. వెళ్ళు శంకరయ్యా.

శంక : (చిదంబరం మార్పుకు విస్తుపోయి) మీరు చెప్తుంది నిజమేనా ?

చిద : అక్షరాలా నిజం, శంకరయ్యా! వెళ్ళిక.

శంక : మీరెంత మంచివారండి చిదంబరంగారూ!

చిద : (రుద్దకంఠంతో) ఆమాట అనిపించుకునేందుకు నేను తగను శంకరయ్యా! ఇక నువ్వు వెళ్ళు మరేమీ అనుకోకు.

శంక : ఎంతమాటన్నారు?... వస్తానండీ. (నిష్క్రమిస్తాడు)

చిద : లేచి (రెండడుగులువేసి) మాట నిలబెట్టుకోడానికి, భార్యనగలు తాకట్టుపెట్టి డబ్బు తెచ్చాడు పాపం! [బైటనుండి శేషాచలం వస్తాడు. బక్కపల్చగా వుంటాడు. పైజమా లాల్చీ ధరించి వుంటాడు.]

శేషా: నమస్కారమండీ చిదంబరంగారూ!

చిద : (ఆశ్చర్యంగా) ఓ! నువ్వటోయ్ శేషాచలం! నువ్వు ఆకస్మాత్తుగా చడీచప్పుడు లేకుండా పరారీ అయ్యావని విన్నాను.' నిజమేనా?

శేషా: (నవ్వి) పరారీ యేవిఁటండీ? మనవాళ్ళు యిదిగో పులంటే అదిగో తోకంటారు. అంతా అతిశయోక్తే! అవసరముండి వూరికెళ్ళాను. ఆ వెళ్ళడం కూడా డబ్బు వస్తుందన్న ఆశమీదే వెళ్ళాను. కాని, ఆశించినంత డబ్బు దొరకలేదు. నేను రాసిచ్చిన నోటుకి లిమిటేషన్ పట్టే సమయం వచ్చిందనుకుంటాను. అందుకే మీరు ఆ మధ్య కబురుపంపించారని విని రాగానే, యిలా వచ్చేను. కొంపదీసి, మీరు దాని విషయమై బెంగ పెట్టుకోలేదుగదా!

చిద : (నవ్వి) బెంగేవిఁటోయ్ గుండెదడ వస్తేను!

శేషా: నేనలా మోసగించేవాణ్ణి కాదని మీకు మాత్రం తెలీదేవిఁటండీ? పరిస్థితులు అనుకూలించక, యిన్నాళ్ళయ్యింది. మీ అందరికళ్లెదుట బ్రతుకవల్సినవాణ్ణి. మోసం చెయ్యడానికి మనస్సెలా ఒప్పుతుందండీ?

చిద : అదీ నిజమే అనుకో! మరి... నా డబ్బు సంగతి ఏం చేశావు?

శేషా: అదే కాస్త మనవిచేసుకుపోదామనివచ్చాను. మీరు నాగురించి యేమనుకున్నారోనన్న భయం యింకా నా గుండెల్లో బితుకుబితుకు మంటూవుంది. ప్రస్తుతం కొంత డబ్బు చేతిలో వున్నా, అది యివ్వలేనులెండి.

కొద్దిదినాల్లో డబ్బువచ్చే అవకాశంవుంది అప్పటికి అంతా యిచ్చేసి నోటు తీసుకుపోతాను. మీరు కాదనరన్న నమ్మకం నాకుంది.

చిద : సరే, అలాగే కానివోయ్... కాని ఒక చిన్నసంతకం చేసేస్తే బావుంటుంది నోటుమీద, పాత తేదీ వెయ్యాలనుకో!

శేషా: మీ యిష్టం అలాగే కానీయండి.

చిద : చక్రపాణీ! (పిలుస్తాడు)

చక్ర : (వస్తూ) బాబూ! (శేషాచలంని చూసి) ఓహో! శేషాచలంగారా! ఎప్పుడు రాక?

శేషా: ఈవేళే!

చిద : చక్రపాణీ! శేషాచలం రాసిచ్చిన నోటు తీసుకు రావోయ్...

చక్ర : డబ్బు తెచ్చాడేవిటి?

చిద : (విసుగ్గా) అదంతా నీ కనవసరం... వెళ్ళి తీసుకురా.

చక్ర : చిత్తం. (లోపలికి పోతాడు)

శేషా: మీ ఆరోగ్యం యిప్పుడెలా వుందండీ?

చిద : ఏగో యిలా వున్నాన్లేవోయ్...

[చక్రపాణి నోటు పట్టుకుని వస్తాడు]

చిద : ఏదీ, చిన్న సంతకం పారేయ్... చక్రపాణీ, కలం యివ్వవోయ్... అలా చూస్తావేవిటి?

[చక్రపాణి కలం ఇస్తాడు. శేషాచలం సంతకం పెట్టి నోటు చక్రపాణి చేతికిస్తాడు]

శేషా: మరి నాకు సెలవిప్పిస్తారా?

చిద : మంచిది వెళ్ళవోయ్...

శేషా: మీరు చాలా మంచివారండీ! వస్తా...(నమస్కరించి వెళ్ళిపోతాడు].

చిద : (శేషాచలం వెళ్ళిపోయినవేపే చూస్తూ) మనిషి మంచివాడేనోయ్!

చక్ర : ఔనండీ, మంచివాడే?

చిద : (నవ్వి) మంచివాడు కాదని నువ్వేనా అన్నావు?

చక్ర : (పెదాలు తడుపుతూ) అప్పటికి అలా అనుకున్నానండీ!

చిద : ఊసరివెల్లివన్నమాట! (నవ్వి) సరేగాని, ఈ నెల నుండి నీకు మరో అయిదు రూపాయలు జీతం పెంచుతున్నానోయ్!

చక్ర : (సంతోషం పట్టలేక) నిజమేనాండి?

చిద : (బాధగా) నేను నిజం చెప్తున్నా, నా మాటమీద యెవరికీ నమ్మకముండ దేమిటోయ్!

చక్ర : అబ్బే! అబ్బే! అదేం కాదండీ? సంతోషంపట్టలేక అలా అన్నానండి? నిజంగా మీరు చాలా మంచివారండీ!

చిద : అంతేలే! అంతే! అందరికీ నే నిప్పుడు మంచివాణ్ణే. వెళ్ళి నీ పని చూసుకో! శేషాచలం తాలూకు నోటు జాగ్రత్తగా వుంచు.

చక్ర : చిత్రం...(గదిలోకి పోతాడు)

చిద : (తృప్తిగా నిట్టూర్చి) హమ్మయ్య? ఇప్పు డెంత హాయిగా వుంది. తుఫాను తగ్గాక వాతావరణం ఎంత స్వచ్ఛంగా, ప్రశాంతంగా వుంటుందో, అలా వుంది మనసిప్పుడు. అందుకే అన్నాడు మహానుభావుడు 'శాంతము లేక సౌఖ్యము లేదు' అని. ఎంత చక్కని వాక్యం! కాని...గతం జ్ఞప్తికివస్తే అదోవిధమైన బాధ కలుగుతుంది. గతాన్ని మర్చిపోవాలి... పూర్తిగా మర్చిపోవాలి.(అని లోపలికి వెళ్తుండగా)



— తెర —

[ సమాప్తం ]

# నూతన గ్రంథాలు

| | |
|---|---|
| ఆడవాళ్ళు | పోలవరపు శ్రీహరిరావు |
| పాకుడురాళ్ళు | రావూరి భరద్వాజ |
| ఎదిగీ ఎదగని మనుషులు | వీరాజీ |
| క్షంతవ్యులు | సి. వి. బి. రావు |
| ఆదర్శాలు - అనుబంధాలు | నారాయణ చౌదరి |
| బుచ్చిబాబు వ్యాసాలు | బుచ్చిబాబు |
| చివరకు మిగిలేది ! (పునర్ముద్రణ) | బుచ్చిబాబు |
| ఒడ్డుకు చేరిన ఒంటి కెరటం | శివరాజు సుబ్బులక్ష్మి |
| మృగతజీవి చివరిచూపు | ,, |
| మూగవోయిన ప్రకృతి | అ |
| ఆశ చేసిన మోసం | వలర |
| కనువిప్పు | |
| నేను - నా దేశం | దరిశి చెంచయ్య |
| లక్ష్మణరాయ వ్యాసావళి | కొమర్రాజు లక్ష్మణరావు |

## ఆదర్శ గ్రంథమండలి,
## విజయవాడ-2.

Wrapper Printed at Swatantra Art Printers, Vijayawada - 4.

| మనసు ఫౌండేషన్ |
| --- |
| పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
| --- | --- |
| పుస్తకం సంఖ్య | TPLA106 15 103 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | YO |
| వెనుక అట్ట | YO |
| మొత్తం పేజీలు | 97 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | BU,ci |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Hema |
| పేజీలు విడదీసినది | Harin |
| స్కాన్ చేసినది | Mounika |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |